# శ్రీకృష్ణకర్ణామృతము

(లీలాశుక సంస్కృత కృతికి తెనుఁగు గీతములు)





రచయిత

కీ. శే. బాపట్ల హనుమంతరావు



ఇందు సుందరముఖుఁ డరవిందనేత్రుఁ
డంబుద శ్యాములుండు, పీతాంబరుండు,
పింఛజూటుండు మురళిశోభితకరుండు
'కృష్ణసాయి' కంటెఁబరంబు నెఱుఁగ-నెఱుఁగ.

(రచయిత)



విధుల నిర్వహణము - వెన్న పెట్టిన విద్య-
సకల జనులయందు సహజప్రేమ
సాధుపురుష మైత్రి - సాయీశపదభక్తి
కలిగి వెలఁగువాడు - చెలిమికాఁడు.

* * * *

కృష్ణసాయికృపను కృతిఁదీసిఁబ్రచురించు
పనికి సాయపడిన - వాడు - భక్తి
పరుడు - **కేశిరాజు నరసింహరావు** ను
యనుఁగు సోదరునిట నభినుతింతు.

—ప్రచురణకర్త.

ఓం

శ్రీసాయినాథాయనమః

శ్రీసాయిప్రసన్నః

# విజ్ఞప్తి

సోదరీ సోదర సాయిభక్తులారా!

శ్రీసాయిప్రభుని అపార కరుణా కటాక్ష ప్రభావమున మీ అందర సహాయ సంపత్తి యాధారముగ పూజ్యులు మా జనకులు కీ. శే. బాపట్ల హనుమంతరావు గారు రచించిన "శ్రీకృష్ణ కర్ణామృతము" పునర్ముద్రణకు అముద్రిత "శ్రీకృష్ణ సందేశము" ను చేర్చి మీకందించు భాగ్యము నాకు ప్రాప్తమయ్యెను. శ్రీసాయిప్రభుని లీలలు అమోఘములు, ప్రతి ప్రచురణకు వలయు విత్తమెట్లు సమకూరునా అను అనుమానము పొడముటయు బాబా తన వరదాభయ అదృశ్య హస్తమును సాచి తోడ్పడుటయు మీకు విదితమే. శ్రీసాయీశ్వరుడీపర్యాయము పోడూరు పంచాయతీ సమితి విస్తరణాధికారియు, సోదరభక్తుడు 'కేశిరాజు' వంశప్రదీపకుడు, నగు చి. శ్రీ నరసింహారావు గారిని ప్రేరేపించి వారిద్వారా పోషకుల జేర్చి గ్రంథముద్రణ యందధిక భారమును వొప్పగించి, నన్ను కృతార్థునిఁ జేసెను.

అధికారపదవియందు వ్యవధి దొరకకున్నను, 'మానవసేవయే మాధవసేవ' గ తన నీమము నాచరణ రూపముగ జూపుచూ, ప్రజా ప్రభుత్వముల మన్ననల నందుచూ, అవకాశమున్న అల్పకాలమును, ఆధ్యాత్మిక చింతనకై వినియోగించుకొనుచూ అనుచరులను సైతము భక్తులుగ తీర్చి భగవతత్త్వము బోధపర్చుచూ, ఆస్తికులుగచేయుచున్న యీ తమ్ముడెంతయు శ్లాఘనీయుడు. అసమ్మతి జూపియు, శ్రీసాయీ

భగవానుని ఆదేశానుసారముగా నాకోరికను త్రోసిపుచ్చక, తన చిత్తరువును పంపి, యిందు ప్రచురించుటకు తోడ్పడి ముఖపరిచయము లేని నన్ను తన ఆత్మీయ సోదరునిగ భావించి, సహాయపడుచున్న చి. శ్రీ కేశిరాజు నరసింహారావు గారిని వీరి కుటుంబమును శ్రీసాయీప్రభువు సర్వదా సర్వథా రక్షించ నా ప్రార్థన.

మనము గత 9 సంవత్సరముల నుండి 18 ప్రచురణములు వెలువ రించగలుగుట బాబా అనుగ్రహమే కాని అన్యము కాదు. ప్రతి ప్రచురణకు వలయు ధనము తుది పైస వరకు తానే సేకరించి, కర్తయు, కర్మయు, సర్వము తానే అయి మన ప్రభువు నిర్వర్తించుకొను చుండెను. కోరిన వారెల్లరకు లభ్యమగు గ్రంధములను పంపుచూ వారిచ్చు కానుకలు పోషక నిధిగ ప్రకటించి, గ్రంధముద్రణకు, తపాలా ఖర్చులకే వినియోగించుట మీ కెల్లరకు విదితమే. కొందరు సోదరులు గ్రంధములు తెప్పించుకొని ముందు ముద్రణలకు తోడ్పడక, కనీసము గ్రంధములు చేరిన వివరం కూడ తెలుప కుండుట విచారకరము. "బాబా జీవిత చరిత్ర". 'సాయీ అనుసరణము' భక్తులకు బహూకరించుటకు ప్రస్తుతము నావద్ద ప్రతులు లభ్యము కావని తెలుపుటకు బాధకరముగ నున్నది. 1983లో "ఏమీ! నిన్ను ప్రేక్షింతునా"? (బాబా జీవిత చరిత్ర) అన్ని సంపుటములు మరియు "శ్రీసాయీ మననము" పునర్ముద్రణ చేయవలెనను సంకల్పము బాబా కలిగించెను. ఇది అధిక ధన వ్యయముతో కూడిన కార్యక్రమము. ఈ సమస్యను పరిష్కరింప సమర్థుడు సాయియే!

## "శ్రీసాయీ నిలయము" నిర్మాణమును గురించిన విజ్ఞప్తి

చెరువు గ్రామంలో పురాతనమైన చిన్న పెంకుటింటి యందొక గదిలో యింతవరకు సాయిబాబాకు పూజాదులు, గ్రంధరచన, పంపిణీ కార్యక్రమములు గావించుచు, భగవానుడొసంగిన కాలము సద్వినియోగ

పర్చుచూ, మీ అందరి ప్రేమాదరణలు పొందుచుంటిని. శ్రీసాయీనాథుని ఆదేశానుసారముగ ఒక గది యందు బాబా పాలరాతి విగ్రహము ప్రతిష్టాపనము, మరొక గది శ్రీసాయీ నిలయ ప్రచురణల కార్యకలాపములు కొనసాగించునటుల రెండు గదులు మందిర నిర్మాణము యిప్పుడు సంకల్పింపబడెను. ఉదారులగు సోదరీ సోదర భక్తులెల్లరు ఉత్సాహముతో స్వయముగను, మిత్రులు, పరిచితుల ద్వారాను విరాళములు పంపి, యీ కార్యభారమునందు భాగస్వాములై తోడ్పడి నన్ను కృతార్థుని చేసి, శ్రీసాయీప్రభుని కృపకు పాత్రులు కాగలరని నా ఆశ. శ్రీసాయీశ్వరుడు మిమ్ముల తగు రీతిని ప్రోత్సాహించి ప్రేరేపించికార్యోన్ముఖులుగ చేయగలరని నా దృఢ విశ్వాసము. రు 1116/– లు అంతకు మించి విరాళము సమర్పించు దాతల పేర్లు మందిరములో శిలాఫలకమున శాశ్వతముగ నుండునట్లులిఖించ బడును.

ఇంతవరకు నాయందు జూపుచున్న అవ్యాజానురాగమును యికముందును ప్రకటించి, కార్యనిర్వహణకు చేయూతనిచ్చి, శ్రీసాయి లీలా మహాత్మ్యములు ఆంధ్ర దేశమున నలుమూలల వ్యాప్తి చేయుటలో భాగస్వాములుగ జేసి మిమ్మెల్లరను శ్రీసాయీప్రభువు సంపూర్ణ ఆయురారోగ్య ఐశ్వర్యాదులు, సుఖశాంతులు ప్రసాదించి, కాపాడ నా ప్రార్థన.

అర్హతను పొంది యా వలనడుగ వలయు

కోరురీతి నదియ సమకూర్చుసాయి।

శ్రీసాయీ నిలయమ్<br>చెరువు<br>10–11–1982

ఇట్లు,<br>శ్రీసాయీభక్తపాదరేణువు<br>బాపట్ల వేంకట పార్థసారథి

శ్రీసాయీసమర్థః

# సవరణ పత్రము

— ం —

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 5 | 2 | హోయలు | హొయలు |
| 6 | 19 | నిగనిజిగి | నిగనిమిచ్చు జిగి |
| 11 | 10 | ప్రేల | ప్రేత |
| 11 | 17 | పడుచల | పడుచులు |
| 12 | 6 | హుయలు | హొయలు |
| 12 | 16 | విధుల | వీధుల |
| 14 | 15 | సగముడి | సిగముడి |
| 15 | 8 | మరువంపు | పరువంపు |
| 19 | 19 | వాని | వీని |
| 23 | 2 | విభదదంబు | విభవదంబు |
| 24 | 1 | వాసనలను | వాసనలును |
| ,, | 2 | బెంపునెజ | ఖెంపునెజప |
| ,, | 3 | యిడుమ | యిడుము |
| 25 | 11 | భయాపనయను | భయాపనయుని |
| ,, | 14 | మేద | మేన |
| ,, | 15 | బూన | బూస |
| 27 | 5 | వాసనల | వాసనలు |
| 29 | 6 | , కులుకు | , రాధిక కులుకు |

| పుట |
|---|
| 29 |
| 30 |
| 31 |
| 34 |
| 39 |
| 41 |
| 41 |
| 42 |
| 43 |
| 43 |
| 44 |
| 44 |
| 45 |
| 49 |
| 52 |
| 52 |
| 54 |
| 54 |
| 54 |
| 54 |
| 54 |
| 55 |
| 55 |
| ,, |

| పుట | సంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 29 | 16 | నీటః మాట? | నీటః నేటి మాట? |
| 30 | 19 | పల్షవ | పల్లవ |
| 31 | 15 | నీణ | వీణ |
| 34 | 12 | గేనాశ్రయింతు | నేనాశ్రయింతు |
| 39 | 2 | పోబగారు | సౌబగారు |
| 41 | 6 | పెర్క్కు | పెక్కు |
| 41 | 18 | జిలిత | జలిత |
| 42 | 18 | ముక్కున్ | ముక్కునన్ |
| 43 | 13 | బొడమ | బొడమి |
| 43 | 17 | నవ్వాని .మిద | నవ్వాని మీద |
| 44 | 2 | తోలిమేన | తొలిమేన |
| 44 | 9 | నడుమ | నడుము |
| 45 | 11 | ్రమోయు | మోయు |
| 49 | 15 | పూరంజగు | పూరంబగు |
| 52 | 8 | ముక్కు | మక్కు |
| 52 | 9 | భాగ్యంబు | భాగంబు |
| 54 | 6 | జిబుసగవు | జిబునగవు |
| 54 | 9 | అఘుత | అమిత |
| 54 | 10 | నా నుదియందు | నా మదియంతు |
| 54 | 12 | లెత్తుడు | లెత్తెడు |
| 54 | 20 | బైనన బాలకృష్ణ | బైన బాలకృష్ణ |
| 55 | 16 | సిక్షించు | వీక్షించు |
| 55 | 18 | బ్రిత | శ్రిత |
| ,, | ,, | సిస్మృతి | విస్మృతి |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 56 | 2 | హుయల్. | హొయల్ |
| 56 | 10 | తొయ్యలులలకు | తొయ్యలులకు |
| 56 | 16 | మాధుర్య రక్షించు | మాధుర్యసిద్ధి రక్షించ |
| 56 | 19 | కతితమైన | కలితమైన |
| 59 | 14 | హుయలు | హొయలు |
| 63 | 3 | కాళించి | కాళింది |
| 63 | 11 | వ్రేణి | శ్రేణి |
| 64 | 12 | వ్రేల | వ్రేత |
| 64 | 13 | వేకులను | వేకువలను |
| 67 | 12 | నుతయమం | నుదయమం |



ఓమ్

నమఃశ్రీకృష్ణాయ భగవతే.

శ్రీసాయినాథాయనమః

# విజ్ఞప్తి

భక్తజనులారా!

లీలాశుక విరచిత శ్రీకృష్ణ కర్ణామృతమును తెనుఁగు గీతములుగ రచించి, యాంధ్రలోకమునకు సమర్పించుకొను భాగ్యము నాకు నేటికిఁ గలిగినది. ఇది కేవలము భగవద్భాగవత కృపాలేశముగాని నా యాధిక్యత ఇందేమియును లేదు. దైవ మొసఁగిన కాలము, బుద్ధి, వాక్కులను సద్వినియోగపఱచుకొనఁదగు నను సంకల్పమే నన్నిట్టి కృతులఁ బలికించుచున్నది. పూర్వమున శ్రీ వెలగపూడి వెంగనామాత్యుఁడను కవి శ్రీకృష్ణ కర్ణామృతము తెలుగు వృత్తములుగ రచించెను. అంతకంటె మిన్నగ రచింపవలయునని నే నీపనికిఁ బూనుకొనలేదు. శ్రీకృష్ణనామ లీలాదికములఁ బద్యరూపమునఁ గీర్తించి యానందింప నిట్లు గావించితిని.

## : లీలాశుకుఁడు - శ్రీకృష్ణ కర్ణామృతము :

బిల్వమంగలుఁ డను నామాంతరము గల లీలాశుకుఁడు "శ్రీకృష్ణ కర్ణామృతము'ను సంస్కృతమున రచించెను. ఈతఁ డాంధ్రుఁ డనియు శ్రీకాకుళవాసి యనియుఁ జెప్పుదురు. ఈ కవికాలము, తదితర విషయములు మన కంతగాఁ దెలియవు. సద్బ్రాహ్మణ వంశమున జనించి, సకల శాస్త్రము లభ్యసించి పండిత కవి యయ్యుఁ గామాసక్తుఁడై 'చింతా

మణి' యను వేశ్యాంగనా ప్రేమపాశములఁ జిక్కుపడి, తుద కా చింతామణి మూలముననే 'సోమగిరి' యను గురువు నాశ్రయించి శ్రీకృష్ణ సాక్షాత్కారము నొందెనందురు. ఇందుకు నిదర్శనముగ గ్రంథారంభమున నీ కవి తనకు వైరాగ్యజ్ఞాన మోక్షదాతలగు చింతామణీ సోమగిరి శ్రీకృష్ణులకు జయనమోవాకము లర్పించెను.

శ్రీకృష్ణ కర్ణామృతము శృంగార రసోదంచత శ్రీకృష్ణ భక్తిప్రతిపాదకమగు మూఁడాశ్వాసములు గల గ్రంథము. శ్రీకృష్ణుని నిరతిశయ సౌందర్య సౌకుమార్య హావభావ విలసనములు మిక్కిలి మనోహరముగ నిందు వర్ణింపఁబడినవి. వేశ్యా సంగతినిఁ జవిజూచిన శృంగార రసము నీ కవి శ్రీకృష్ణునకు జుబ్బనచూఱగ నిల్పినాఁడు. గ్రంథమునం దెల్లెడ లీలాశుకుఁడు శ్రీకృష్ణునకుఁ గూర్చిన గొనబుసొమ్ము 'నెమలిపురి', 'సొమ్ము లవియేల? యొక్క పింఛమ్మె చాలు' ననినాఁడు. సర్వసాధారణముగ నెమలిపురి, పిల్లఁగ్రోవి కృష్ణున కీయక మానఁడు. కురులఁ జెరివిన పురి, యమృతము లొలుకు పిల్లఁగ్రోవి, యవ్వనము తలసూపు శైశవము, ముగ్ధలు మోహపరవశలగు గోపికల కూటములు నీ కవికి మనోహరములు.

'చిర 'ముపాస్యంబులనఁ' గృష్ణు చిఱునగవులు,
బురియు, వెడఁద కన్నులసొంపు, మోముఁదమ్మి
మురళి రవళి, వ్రేఁజవరాంగ్ర విరహచరిత
ములగు నా 'చిత్త సంస్కారములకు' జయము!"

అని వానిని తన కుపాస్యములని, చిత్తసంస్కారములని చెప్పుకొనినాఁడు.

లీలాశుకుఁడు శైవుఁడయ్యుఁ బ్రాక్తనపుణ్య విశేషమున శ్రీకృష్ణ

భక్తిఁ బడసి తన్మూలమున కృష్ణసాక్షాత్కారము పొందినాఁడు. వేశ్యా శృంగార రసమునం దూరి యూరిన యీకవికి వైరాగ్య దశయందు గోపీ లంపటుని యందేకాని సీతావల్లభునియం దాసక్తిలేదు. శ్రీరామ రూపమునఁ దనయెదుటఁ బొడమిన యా పరవస్తువు నుద్దేశించి

"విల్లు బాణముల్ క్షణమాత్ర విడచి వైచి
మురువులొలికెడు మురళినిఁ గరమునందుఁ,
దలను పింఛపు దండలఁ దాల్తువేని
జనకజా మనోహర ! నీకుఁ బ్రణతిసేతు"

అని బాలకృష్ణ రూపమునఁ దనకుఁగల యభిరుచిని వెల్లడించినాఁడు. ఈ కవికి విషయలోలతఁ దలమున్కలై యుండిన శృంగార రసమే వైరాగ్య దశయందు వాసనా బలమున ననువర్తించినది. కాని పూర్వము వలెఁ బ్రాధాన్యముఁ గానక వైరాగ్యమున కంగమై శాంతిరసము కటుత్వ మును మాన్పి దాని కొక భోగ్యమును సమకూర్చినది. ఇట్టి వింత సంఘట నలు మహాత్ముల చరిత్రలఁ గాననగును. మునుపటి శృంగారమున కాలంబనము వేశ్యయగు చింతామణి. ఇప్పటి శాంతి రసానుగృహీత శృంగారమున కాలంబనము వశ్యగోపాలచింతామణి. పరతత్త్వము నందలి కామోత్కంఠత నిర్మలభక్తిగ పరిణమించి గోపికల నాదర్శ ప్రేమ మూర్తులుఁగఁ జేసినది. నారదుఁడు భక్తిసూత్రము లందు ప్రేమ తత్త్వ మును నిర్వచించి యుదాహరణముగ "యథావ్రజగోపికానామ్" అని పేర్కొనినాఁడు.

"అహో! భాగ్యమహో! భాగ్యం నందగోపవ్రజౌకసామ్
యన్మిత్రం పరమానందం పూర్ణబ్రహ్మ సనాతనమ్"

అని బ్రహ్మయంతవాఁడు గోపికల భాగ్యమును గొనియాడినాఁడు. అక్రూరుఁడు గోపికల భక్తి కచ్చెరువంది,

"వందే నందవ్రజస్త్రీణాం పాదరేణు మభీక్ష్ణశః
యాసాం హరికథోద్గీతాం పునాతిభువనత్రయమ్॥"

అని గోపికాచరణరజమునకు సాఁగిలఁబడి మ్రొక్కినాఁడు. దేవతలకు ఋషులకు దుర్లభమైన పరవస్తువు శ్రీకృష్ణరూపమున గోపికల కధీన మయ్యెను. కామోత్కంఠతఁజేఁ గృష్ణునిఁ బడయఁజాలిన గోపికలవెఱ్ఱిఁగి కాముకుఁడగు లీలాశుకుఁడు తనకామమును గోపికా మోహనుఁడగు శ్రీకృష్ణనందు నెఱపి జన్మసాఫల్యమును బడసినాఁడు. శ్రీకృష్ణావతారమునఁ గల సర్వసౌలభ్యమును ప్రేమతత్త్వమును విశదపఱచినాఁడు.

'శ్రీకృష్ణ కర్ణామృతము' (గీతములు) ఇందు మూఁడు బిందువులుగ విభజింపబడినది. మొదటిబిందువునందు — పరతత్త్వము బాలకృష్ణ రూప మునఁ గలదని వస్తునిర్దేశముచేసి, తన్మూర్తి మనోజ్ఞ సౌందర్యాది విశేష ములవర్ణించి, శృంగార రస సర్వస్వమైన రూపము కవి, తనమనసునఁ బొలిచి యాకర్షించిన విధముఁ దెలిపెను. తనకు వాగ్జీవమైన శ్రీకృష్ణునకు జయము పలికి, 'వ్రజాంగనా స్తనాగ్ర కుంకుమాంకితుఁ' డగు ప్రభువు నాశ్రయించినాఁడు; ఆశ్రితాభయదాన ముద్రాంకితమగు కృష్ణపాదాంబుజము తన కేఁడుగడగఁ బేర్కొనినాఁడు; గొల్లపల్లె నెల్లత్రోవలఁ బఱగువాఱు ప్రభుపదములకు జోహారు లిడినాఁడు; కృష్ణ కపటనిద్రను గొలిచినాఁడు. 'చిన్నికృష్ణ నెన్నటికి వీక్షింపగలనో?' యని తన హృదయోద్వేగమును బ్రకటించినాఁడు; "కృష్ణచంద్ర! దృక్చకోరములకు సౌఖ్యమిడవే!"—సొగసు లొలుకు నీ తేజముఁ జూపుకృష్ణ!" అని ప్రార్థించి, కపట గోపడింభకు

నిన్నుఁ గన్నులారఁ గౌగిలింపఁగఁ దమకము కలదు కృష్ణ!' యని తన కాంక్ష వెలిఁబుచ్చెను. తుదకుఁ దనకోర్కె ఫలించి శ్రీకృష్ణ సాక్షాత్కారము వడసెను. కవి హృదయమున బాలకృష్ణు రూపు బొమ్మకట్టు లచ్చు పడినది. అట్టి కృష్ణునందు లీనముఁ గాఁగోరెను; అట్టి సొంపు 'లేదు-దేవతలందేని లేదు- లేదు" అని యుద్ఘాటించినాఁడు; ప్రభువు బాలలీల లెల్లెడఁ గాంచినాఁడు. "అంబ! లోకముల్ బాలమయంబు లయ్యె" నని నాఁడు; అట్టి యాద్య 'సుకృత పరిపాకజన్ములే చూడఁగలరు' అని తెలిపి నాఁడు. రాధికా కుచస్థలశయనీయునకుఁ బ్రణతు లొనరించినాఁడు. "వ్రజ సతీ కుచతట గుప్తరాజ్య మిదిగో! బాలగోపాలు నేత్రపర్వముగఁ గనుడి" యని మనకుఁ జూపినాఁడు. "సతము శ్వేతల ముత్తెపుసరుల మురిసి పెనయు మరకత నాయకమణిని – చక్కదనముల మేరను – గొలిచి, 'ఎట్టి వారుఁ గనని నీ రూప మీవాని కన్నుఁగవకుఁ జూపితివి కృపన్ గృష్ణ! నా సుకృతమేమొ!" అని తన సుకృతమును గొండాడుకొనినాఁడు. ఇన్ని విభవములుగల "నీకేల జార చోర వృత్తి కృష్ణ!" యని ప్రశ్నించి, కృష్ణు నందుఁ దనకుఁగల చనవును వెలిపుచ్చి "మురువుఁ జెలఁగు నీ తేజునకు నమస్కృతులు కృష్ణ!" యని ప్రణతు లర్పించినాఁడు.

రెండవ బిందువునందు శ్రీకృష్ణలీలలు పలువిధముల నిపుణతతో లీలాశుకుఁడు వర్ణించెను. మురళి భాగ్యమును బొగడి 'మోవి నూదువేళ నన్ను హరి కెఱిఁగింపు వేనతులు నీకు"-అని ప్రార్థించినాఁడు. వసుదేవు భాగ్యమును బ్రస్తుతించి, యులూఖలబద్ధుఁడైన కృష్ణునిఁ బేర్కొని "ముజ్జగంబులు వెన్నని బొజ్జనుంటఁ దల్లడిల్లి గూయిడె వెఱ్ఱితల్లి పనికి" యనుని, యశోద కావించిన యకార్యమును దెగడినాఁడు. "నిగమ వనమున

శ్రమనొంది నెమక నేల గొల్లయిండ్ల జోటను గట్టువడియె...సకల వేదాంతలక్ష్యమౌ శ్యామమూర్తి" వెళ్ళి చూడుఁడని మనకుఁ దెలిపినాఁడు. పార్థరథభూషణము, దేవకీపుణ్యరాశి తనభక్తునకుఁ జేయు నూడిగముల వివరించినాఁడు. కృష్ణ మత్తగజమునకుఁ గట్టు కంబములు 'యశోద జోలెన్, ముని హృదయమేని, నిగ్గుగను వ్రేనెలత చను మొగ్గగాని' యని సంకేతించినాఁడు. యశోద అమాయకత్వము, కృష్ణుని వింత చెయ్వులు సంభాషణలు వివిధములుగఁ బలికినాఁడు. పూర్వావతార ప్రశంసలను గావించి, లక్ష్మి హాస్యోక్తులఁ జిత్రించి, నందు ముంగిటఁ బ్రాకు ముకుందునిఁ గొనియాడినాఁడు "క్రతువులకుఁ బోవు వ్రేపల్లె గంతులిడేదు... సేవఁగొనవు గోపికలకు సేవసేతు; ప్రేమమూలము నీదు ప్రాప్తికినిఁ గృష్ణ!" యని యవతార సౌలభ్యమును మెచ్చి 'గోపనిచయ హార తరళనాయక నీల రత్నమునకు నమస్కరించినాఁడు.

మూఁడవ బిందువునందు 'వల్లవీబాల నీలమును' బ్రతిపాదించి, మురళీబాలతేజమునకు మ్రొక్కి, నందపుణ్యాంబురాశి కన్యం బెఱుంగ ననుచు, బృందసుందరీ విటునకు వందనము లర్పించినాఁడు. వల్లవీనితంబ స్తన భార వీక్ష దామితోత్సాహియౌ ఘనశ్యాముఁ దలఁచినాఁడు. "నంద నాయకీ సమార్జిత కీర్తితోయరాశి నీలశీతాంశు వీక్షించు వేళ యెపుడొ?" యని యావేదనపడినాఁడు. 'గొల్లపల్లె పాళెము; భటుల్ గొల్లవాండ్రు... శివ! శివా! ముజ్జగముల కీశ్వరుఁడ వందు రార్యులిదేల? కృష్ణ!" యని ప్రశ్నించి, 'నంద సర్వస్వమునకివె వందనములనినాఁడు. తుదకు, అధికార తారతమ్యమును బాటింపక, భక్తిమాత్రము గని, పరిగ్రహించు శ్రీకృష్ణ కృపావిశేష ముద్ఘాటించుచు

"విదురసేవ, భరద్వాజు విందుఁ, గొంతి
ప్రియము, శబరిఫలము, విప్రుపృథుకములు, న
గార్చనముఁ, దల్లిపాలు, రాధాధరంబుఁ
బ్రీతిఁ గొనునట్లు కృష్ణ! నా కైతఁ గొనవె!

యని సాఁగిలఁబడి కృతినర్పించినాఁడు.

"యౌవన మదంబుననుడిగఁ ద్రావి విడిన గొల్లచెలుల యుచ్ఛిష్టమౌ కువలయ దళ నీలకాంతి పూరంబగు" శ్రీకృష్ణ రసాయనమును గ్రోలి, సంతృప్తిఁ గనిన శ్రీలీలాశుకోచ్ఛిష్టమును దిరిగి చర్వణముఁ గావించి, లభ్యపడిన రసమాస్వాదించి కృతార్థుఁడఁ గాఁచెంచిన నన్ను భగవానుఁడగు శ్రీకృష్ణుఁడు, తదీయులగు భాగవతు లనుగ్రహింతురు గాతమని వినతుఁడనై మ్రొక్కుచున్నాఁడను, ఇందలి గుణములను మాత్రము గ్రహించి దోషముల క్షమింపఁ బాఠకశ్రోతలగు భక్తజనముల సంప్రార్థించువాఁడను.

దుర్ముఖి ఆశ్వయుజ
శుద్ధ ౧౦ భానువారము
చిన్నగంజాము

ఇట్లు,
భక్తజన విధేయుడు,
**బాపట్ల హనుమంతరావు**



ఓమ్

నమో భగవతే వాసుదేవాయ

శ్రీ సాయీనాథాయనమః

# శ్రీకృష్ణ కర్ణామృతము

## ప్రథమబిందువు

శ్రీమదంచిత జయము! చింతామణికిని,
అనఘుండౌ సోమగిరి గురువునకు జయము!
విజయలక్ష్మి స్వయంబ సేవించు పింఛ
మకుట భగవత్పదాబ్జములకు, జయంబు! 1

సుర పురంధ్రులు విరివానఁ గురియ, జాఱు
కోకలను బూని గోపికల్ గూడి కొలువఁ,
బరము శ్రితులకై చేఁబూని, మురళి గీతిఁ
బఱచు వస్తువు బాలు రూపమునఁ బొలుచు. 2

నిగ నిగని కాంతిఁ గడ కనుల్ నీటు మీఱి
యమృతమును జిల్క, సిరి కాశ్రయంబు నగుచుఁ
గామ జనకమై, యమున చెంగటఁ జరించు
నందముల కిక్కయౌ శ్యామునిం దలంతు. 3

గొల్ల గుబ్బెతల్ బిగువు కౌగిళ్లఁ జేర్ప
జవ్వనము మొలకెత్త; వంశంబు మొఱయు,
సిగను పింఛమూని మొగంబు సొగసు లొలుకు
భువన మోహన తేజంబు పొలిచె మదిని. 4

చిఱు నగవు మోము దామరఁ జిందులాడ,
నెఱి కురులు నెమ్మిపురి కల్మి మురువు సూప,
వెడదఁ కనులు పెంపిడ, నిరూపింపరాని
తేజము చిరంబు నాదు మదిన్ గ్రహించె 5

సగము మోడ్చిన కనుదోయి సొగసు దోఁప
వేణు నినదంబు తియ్యని తేనె లొలుక,
నిగ నిగని నును బుగ్గల నీటు పొసఁగు
వెన్ను మోముఁ దామర, మది వెలయుఁ గాత. 6

కను గొలఁది నాస పెనుచు చక్కనగు రూపు
వేణు కలరవా దృత ముఖ బింబ మమరు
కృష్ణు సోయగమున నొక యించుకేన్ మ
దీయ రసనాగ్ర మందు వర్తించుగాఁత! 7

మరులు ప్రేరేచు మోము దామర చెలంగఁ,
బింఛమును సిగఁ గీల్కొల్పి, వ్రేత లెల్లఁ
జెలిమిఁ బఱపి క్రీఁగనుల వంచింప మించు
నాదు వాగ్జీవమౌ కృష్ణునకు జయంబు! 8

చిగురు జేగురా కేల్దమ్మిఁజేరి మురళి
కులుకఁ, బాటలారుణ పాద జలజ యుగము
నధర బింబ మింపెసఁగు బ్రజాంగ నా స్త
నాగ్ర కుంకు మాంకితుఁ, గృష్ణు నాశ్రయింతు. 9

మదను సందేశ మన రసం బొదవు నిడుద
వాలు కడగంటి చూడ్కుల చాలు పఱపి,
ప్రేమ నెలంత లేప్రొద్దు నర్చింపఁ, బ్రేమ
నెఱపు విభుని, శ్రీకృష్ణు నేమఱకఁ గొలుతు. 10

సోయగంపు వగల్ దోప సొంపులీను
వాలు బెళుకుఁ గన్నులును, జవ్వనము దనరి,
గొల్ల పడుచుల వెన్నంటి కులుకు, పలుక
రాని వెలుఁగు, దీపించు నా మానసమున. 11

అఖిల నిత్య లీలా సంపదా కరములు,
వారి రుహ సర్వ గర్వ నివారకములు,
ఆశ్రితాభయ దాన ముద్రాంకితములు,
కృష్ణ పాదాంబుజములు నా కేఁడు గడలు 12

విభవముల పట్టు గొమ్మలు, క్షేమ సీమ,
లను దిన నవీనములు, క్షణ క్షణ మనోజ్ఞా
తాతి శయములు, స్నేహ వర్షా స్పదములు
కృష్ణ నయనాంబుజములు నన్నేలుఁ గాత! 13

చెలువ మేపారి సింగార మొలుకు చున్న
చల్లనగు చిన్నబాలు వేసంబుఁ దాల్చి,
చిఱు నగవు లీను మోము చందురుఁడు పొసఁగు
కృష్ణ హర్షాబ్ధిఁ దేలు, నా హృదయ మెపుడు. 14

మురళి నూఁదుచో సహజ సుందర ముఖార
వింద మండంపు సొబగులు వెల్లి విరియ,
జగములను జల్లఁ బఱచు తేజమగు కృష్ణుఁ
డాడు నా యెద నరుణ పాదాబ్జుఁ డగుచు. 15

గజ్జె లందియలును ఘులు ఘల్లు మనఁగ
హల కులిశ గోపురాది రేఖలను గొల్ల
పల్లె నెల్ల త్రోవలఁ బొందు పఱచి, పఱగు
వారు ప్రభు పదంబులకు, జోహారు లిడుదు 16

యామునీయ సరోజ వనాంతరమున
మెలఁగు కలహంస కూజితములను గ్రేణి
సలుపు, పల్లవీ విభు నందియల రవంబు,
వెలయుఁ గావుత! నా మనోవీథి నెపుడు. 17

కరుణ వర్షించు నిడు వాలుకన్ను గవయు,
సిరికి నెడఁ బులకలు దోఁపఁజేయు సొగసు,
ముని మనముల నాకర్షించు మురళి రవళి
కలుగు వ్రజరాజు, నా మదిన్ తెలఁగుఁ గాత! 18

మురళి మ్రోయింప, బ్రియముఁ దత్తరయు దొఱయుఁ
దఱియు వ్రేతల మోము చందురుల హొయలు
పఱపు నఱమోడ్పు కన్ను దామరలఁ గనెడి
మొదటి బాలు చందం బొందు, మదినిఁ దోఁచు. 19

పురిని సరిసేసి, చెదరిన కురులు దిద్ది,
విడిన చేలముఁ బూని, తన్వొడల నీక
తిగుచు గొల్ల గుబ్బెత చేయి బిగువుఁ ద్రోసి,
మరుని సెజ్జఁ బాసెడి కృష్ణు, మదిఁ దలంతు. 20

వీనులకు విందు సేయు గోపికల మంత
నముల వినుచు, వెల్వడు చిఱునగవు నడచి,
యొడలు గరుపాఱఁ గనుదమ్ము లూరకే మొ
గుడ్చు కృష్ణు కపట నిద్రఁ గొలుతు మదిని. 21

గొల్ల జవరాండ్ర కొమరారు గుబ్బలందుఁ,
దాపసుల డెందమందు, బృందావనంబు
నందు గాక, వేఱొండెడ నరయఁ దలఁప,
మొల్ల నోముల పంటయౌ కృష్ణ చంద్రు. 22

డెందమును దన్పి వీనుల విందు సేయ
నోపు పిల్లన గ్రోవిని నూది కొనుచుఁ,
జక్కఁ దనముల నన్నిటిఁ జక్కదిద్దు
చిన్నకృష్ణు నెన్నటికి నీక్షింపఁ గలనొ? 23

జూసగా సిగపై నెమ్మి పురిని నిలిపి,
మిగులఁ దేనె లొల్కెడు చిఱు నగవు కలిమిఁ
జల్లఁదన మెచ్చు మోము జాబిల్లి తోడఁ
గృష్ణుఁ డీ కనులకు సౌఖ్య మెప్పుడిడునో? 24

కడ గనుల చూపు లెంతయుఁ గరుణఁ జిలుక,
వింత లీలలు జగముల వెలుఁగఁ జేయ
యవ్వనము పొల్చు బాల్యంబు నమరు కృష్ణ
చంద్ర! దృక్చకోరములకు సౌఖ్య మిడవె! 25

యామునీ తోత్స లాభములా కృపా క
టాక్ష వీక్షణముల నింక నరయు టెపుడో!
శంకర జటేందు శీతల సద్వశ వేణు
నాద సుధఁ గ్రోలి, హృదయ మేనాఁడు మనునో? 26

తెళుకుఁ జూఁపులు, సరసమౌ పలుకు బడియు,
గరువ మొయ్యారమగు నడకయును, బిగువు
కౌగిలియు, మరుతెచ్చు జోకగు స్మితంబుఁ
గలవు నీకని, కృష్ణ! వ్రేతలు వచింత్రు 27

వెడఁద కన్నులుఁ, జిఱునవ్వు, వ్రే మిటారి
కలికుఁ బాలిండ్ల వలుగుడుఁ గనిన యొడలు,
నిగ నిగని జిగి మిటాళ్ళి, జగము లందు
సొగసు లొలుకు నీ తేజముఁ జూపు కృష్ణ! 28

ఈవు కరుణించు నెడ నన్న్యేల నాథ?
కరుణఁ గనవయ్యొ, నేపని పరుల వలన?
మురళి రవళిని వెన్నంటి మురియు నీదు
క్రేఁగను లొకింత నిటు ప్రసరింపు, కృష్ణ! 29

జేల తనమున నేనిదె కేలు మోడ్చి,
దీనమతి నెలుఁగెత్తి యర్థించు చుంటిఁ;
గరుణ రస మొల్కు నీ కడ గనుల నొకటఁ
బఱపఁ గదె వీనిపయి దయాశరధి! కృష్ణ! 30

సిగ ముడిని నెమ్మిపురిఁ జక్కఁ జెరివి, గొల్ల
చెలులు కన్నుఁ దామరలఁ బూజలను సలుప,
శోభఁ గమలమున్ గికురించు మోము గలుగు
బాలు నిన్నుఁ జూడఁ గను లాసపడెడి గృష్ణ! 31

జగము లం దద్భుతంబు నీ శైశవంబు
పలుక సిగ్గగు నాదు చాపల్య మకట!
మురళిఁ బలికించుచును కృష్ణ! మురువు గులుకు
నీ ముఖాబ్జముఁ గనుట కింకేమి తెరవొ? 32

అమృత రస ముట్టిపడఁ బదార్థములఁ బెనచి,
వాలుఁ గనులు మీటుచును, గోపకులు మెచ్చ
వయసు కాండ్రటు నీ వాడు పలుకు లెల్ల,
గొల్ల చెలువల మతుల భాసిల్లుఁ గృష్ణ! 33

చందురునిఁ గేరు మోము తేజము వెలుంగ,
బూర్ణ కరుణామృతాబ్ధివై మ్రోల నిలచి
తేనెలను జిల్కు నీ వేణు గానమునను
నా సమాధినిఁ జెఱచు చున్నటికొ? కృష్ణ! 34

ముగ్ధ చేష్టలు బెళుకుఁ జూపులను దలఁచి
డెంద మింపొందఁ, జూడ్కికి విందు సేయు
కపట గోప డింభకు నిన్ను, గన్నులారఁ
గౌగిలింపఁగఁ దమకము గలదు, కృష్ణ! 35

చలిత బింబాధరము విలాసముల నెఱప,
ముదము నడి వేణునాద సంపదలు పొదల,
నెంతయు మనోజ్ఞమైన యీ కృష్ణ తేజ
మక్కటకట! నా హృదయమున్ వ్యథలఁ బెట్టు 36

మెదపిఁ మర్మముల్ సంధులఁ బ్రిదిలఁ జేయు
మృతి గ్రసించు పూర్వమె, నీ ముఖేందు చంద్రి
కలను నా పయిన్ బొలయించి, చెలువ మినుమ
డింపఁ గదె, కృష్ణ! కన్నుల యెదుట నిలచి 37

పదియవ యవస్థయా పెను ముదిమి పొదివి
కనులు గనరాని గతి గల్గు మునుపె, లచ్చి
వెలుఁగు నెలవయి వన్నెలు గులికి మురళిఁ
బలుకఁ జేయు నీ మోముఁ జూపఁగదె! కృష్ణ! 38

బెళుకుఁ గంటి చూపుల చాలు వెలుచు నెడ, ని
వాళి సంపదఁ గూర్చు గోపాలుఁ డెప్డు,
మురళి రవళి కింపుగ మ్రోయు రత్న
నూపుర నినాదఁ మెడదను దోఁపఁజేయు 39

కృష్ణ! దేవా! దయిత! జగదేక బాంధ
వా! చపల! కరుణా రసైకాంబు రాశి!
నాయకా! రమణా! నయనాభి రామ!
కనుల తనివి దీరఁగ నిన్ను గాంచు టెప్డొ? 40

దయకు నిధివి యనాథ బాంధవుఁడ వైన
నిన్ను దర్శింపకే కృష్ణ! యెన్ని యేని
దినములను వ్యర్థముగ బుచ్చితిని, యిదెట్టి
పాప కర్మమో! నీ కృపఁ బడయు టెటులొ? 41

నగు మొగంబుచేఁ గనుల పండుగ నొనర్చు
కృష్ణు దీనతఁ జిరము వీక్షింపఁ గోరు,
దేమి విను దేరికి వచింతు? నెటుల నాశ
లడఁతు? హృద్వ్యాసు నెటులెంతు? నానతిడరె? 42

వెడదలౌ తమ్మిరేకుల పెంపు నెఱపు
కనుల సోయగమును గల్గి తనరు చిన్న
కృష్ణుఁ, గనులారనేనిఁ గౌగిలినిఁ జేర్పఁ
దోడ్పడక, యదృష్టము కటా! దూరమయ్యె. 43

చిరునగవు గల్గి యొఱ్ఱనై చెలఁగు మోవి,
యుబ్బి రెండింతలింపుగా నూఁదు మురళి,
నడిఁగడలు నరమోడ్చిన వాలుఁగనులుఁ
గలుగు నీ ముద్దుమొగ మెప్డు గాంతుఁ? గృష్ణ! **44**

హొయల వెడదలై సింగార మొలుక, మిగులఁ
జల్లనయి నల్లజేగురు చాయలొలసి,
చిన్నవన్నె లచ్చెరువొప్ప, కన్నగవ నిఁ
కెన్నడు కృపాబ్ధి కృష్ణుఁ, డీ నన్నుగనునొ? **45**

నెఱికురులగుంపుఁ, జెదరిన నెమలిపురియుఁ,
బెళుకుచూపు, లింపగు కెంపుఁ బెదవి నగవుఁ
బెక్కు సొబగులు గురిపించు వెన్ను సుంద
రాకృతినిఁ గనుగొఁన, గన్నులాసపడెడి. **46**

మిగుల మబ్బుకాంతిని మీఱి, సొగసు నెగడి,
నెమ్మిపురి బూనయును మోము దమ్మిదనరి,
కరుణఁ గురియుఁ గ్రేఁగనుల జగముల మనుచు
నందముల కుప్ప జాడల నరయువాఁడ. **47**

మునులకేన్ దూరమగుచుఁ, బ్రామినుకులకును
నందరాని భువన మోహనాంగుఁ డగుచు,
నల్లకలువకాంతినిఁ గేరి, గొల్లచెలుల
కన్నులకుఁ దోఁచు కృష్ణునేఁ గాంచుటెపుడొ! **48**

బెళుకు వాలుచూడ్కులు, హొయల్ దొలుకు మోము,
కులుకుఁ గన్నుల ప్రేమంబు తొలకరించి,
పిల్లగ్రోవిఁ బల్కెడి మిష, ప్రేతలకును
మంతనము లంపు, శ్రీకృష్ణుఁ, గాంతు నెపుడొ? 49

తేనియల్ గారు కెమ్మోవి లేనగవును,
నిండుజాబిల్లి మోమును నెగడి, లేఖ
నీయ మాగు సుందరాకృతి నింపు, కృష్ణు
బాలరూపు, బొమ్మటు లచ్చుపడియె మదిని. 50

అరుణ రవి కరములు సోకి విరియు తమ్మి
రేకులను గేరు కన్నులు, ప్రేలతోడి
మదన కదనంబునను గల్గు మదపు సొంపు
లూను శ్రీకృష్ణునందు, నే లీనమగుదు. 51

చిగురుటాకులఁ ద్రేణించు చేతిప్రేళ్ల
మురళి కైసేసి, యమృత సుస్వరములూది,
కెంపుమోవి లేనవ్వుల సొంపు లనిశ
మూను శ్రీకృష్ణునందు, నే లీనమగుదు. 52

గొల్లపడుచుల రతికేళిఁ బెల్లు రేగి
గుబ్బలను గ్రుమ్మ నెడఁదఁ గుంకుమము దోఁప,
వెన్నెలను గేరు చిఱునవ్వు వెలయ మోముఁ
బూను శ్రీకృష్ణునందు, నే లీనమగుదు. 53

బొమల వంపును, బర్హాంకురముల పెంపుఁ,
గనుల కదలింపు, సరసభాషణము సొంపు,
మురళి మొరయింపు, సుధలీను మోవి కెంపు
నమరు శ్రీకృష్ణుఁ గనఁ, గనులాసనింపు. 54

అట్టి లేఁబ్రాయ సోయగ, మట్టి మోము,
నట్టి కరుణయు, హాయలీను నట్టి కనులు,
నట్టి చిఱునవ్వుసంపద, యట్టి సొంపు,
లేదు - దేవతలందు నేన్ లేదు - లేదు. 55

భక్తివిశ్వాసములను సేవలఁ బొనర్చు
దీనజనుల బాధలఁ బాపు దీక్షఁబూని,
క్షణముక్షణమును నూతన కాంతులొలుకు
కృష్ణు బాలలీలలు గాంతు, నెల్లయెడల. 56

సిగను బురిఁజేర్చి నల్లనై నెగడు మేను,
మొగము వింతలొ చిఱునవ్వు సొగసులీన,
బెళుకుఁ గన్నులు ముద్దు పల్కులును గులుకు
లమర, మధుర విధులఁ బోవు నాతఁ డెవఁడొ? 57

జలజములఁ గేరు శ్రీకరంబులు పదములు,
మురళి మొరయించు నేర్పొప్పు కరయుగంబు,
వలపుఁ గొలుపు మూఁపులుఁ, దేనెలొలుకు పలుకు
లమరె, నిట్టి తేజము, బాలుఁ డగున యేమి? 58

సొమ్ము లవియేల? యొక్క పింఛమ్మె చాలు,
తిలకముల కాంతి సంపదఁ దేలె మోవి,
యలఁతుల కెఱుంగఁగా రాక కులుకు సొగసు
వెలుఁగు, చిత్రము! చిత్రమై చెలఁగునౌర! 59

ఎదుట దవ్వుల దిక్కులం దెల్లయెడలఁ
బలుక రాని యీ తేజము కులుకుచుండె;
కనులె సాక్షి, యిదెట్టి యక్కజమొ కాని
అంబ! లోకముల్ బాల మయంబు లయ్యె. 60

మురిపె మిడు కురుల్, పలుచని ముంగురులును;
వచ్చిరాని పల్కులు, నిడు వాలుఁ గనులు,
సొగసు లిడు మోవి, చెలువైన మొగము గలుగు
చంచల చరిత్రుఁ గృష్ణు, నేఁ గాంచు టెపుడొ? 61

మాధవా! కరుణాంభోధి! మనువు మనుచుఁ,
బలుమఱు భజించు న, న్నాత్మ బాంధవుండు,
మురళి మధుర స్వరంబుల మురిసి యాడు
కృష్ణు డెపు డోమ నా మొఱాలించఁ గలఁడొ. 62

ఏ విపద్దశ నున్న నన్నెఱిఁగి కరఁగి
యార్త సంరక్షణుండు, దయాంబు రాశి,
కొమరుఁ బ్రాయంపు సొబగులు గురియు నంద
బాలకుఁడు చూచునో నిడు వాలు కనుల? 63

కెంపు మోవియు సొగసులు నింపు నగవు
పెరిమ పలుకులుఁ, జల్లని వీక్షణములు,
వెడద కన్నుల్గు, నింపగు వేణు రవళి
పరగు, నీల బాలునిఁ గాంచు భాగ్యమున్నె? 64

అందముల కెల్ల నందమై యతిశయిల్లి,
చపలముల నన్నిటను గడుఁ జపలమైన
కంతు జనకుని మోహనాంగములు, నాదు
చిత్తముఁ గలంచె, నిఁక నేమి చేయఁ గలను? 65

వెడఁదయగు నుర స్థలమును వీక్షణములు
మురువు దొలుకాడు పలుకులుఁ జిఱు నగవును
బెంపు నటియించు కెమ్మోవి వేణు రవళిఁ
గలిగి సొబగారు బాలు నేఁ గాంచు టెపుడో? 66

కరుణఁ గురిపించు నిడు వాలుఁ గన్నుగవయు
లేఁత నగవులు దొలుకాడు వా తెఱయును
పురిని జెరివిన నగముడి పొలుచు నాద్య.
సుకృత పరిపాక జన్ములే చూడఁ గలరు. 67

మరుని తేజంబో! శీతాంశు మండలంబో!
హృదయ నయనామృతమొ! మాధురీ రసంబో!
పలుకుల శుచిత్వమో నాదు ప్రాణ పదమొ!
బాలుఁ డితఁడు నా కన్నుల ప్రోలుఁ బొడమె. 69

తెఱలి బెళుకుఁ జూపుల కల్మి దిఙ్ముఖంబు
లెల్లఁ జిత్రీకరించుచు, గొల్ల కొలము
సొమ్ములను దాల్చి, మురువంపు సొంపు లొలుకు
వేసమునఁ, గన్నులకు విందు సేసె నితఁడు. 69

మూపులు నటింపఁ, గన్నుల్లు మురిపె మొలుక
మోముఁ దామర చిఱునవ్వు పొలుపుఁ గులుక,
సొమ్ములు ధ్వనింప, సిగను పింఛమ్ముఁ దాల్చి,
యందగాఁడు నా కన్నుల విందు డాసె. 70

గొల్ల కూటువకును శోభఁ గూర్చువాఁడు,
చల్లనగు బెళ్కుచూపు లెసంగు వాఁడు,
చిఱు నగవు మోము దామరఁ బఱగు వాఁడు
చిన్నవాఁడు నా మది పొంగఁ జేరె నిదియొ! 71

నలుపు రుచులీను మేనును, బెళుకుఁ గనులు,
మురువు లొలుకు చందురుఁ గేరు మోముఁ దనరి.
వేణు నినద సంపదలకుఁ బ్రాణమైన
కృష్ణ తేజంబు, నాదు కట్టెదుటఁ బొడమె. 72

చపలముల పొందు, కలుముల సకియ విందు,
నేరుపుల కందు, నలువ పూనిక పసందు,
తావులకు బందు, సకలాద్భుతములఁ జిందు
నందమంది రానందు, గోవిందుఁ గందు. 73

సొగసు లొలుకుచుఁ జల్లనై నెగడు మోము,
వీనులకు విందుఁ గూరుచు వేణు రవళి
తనరి, నాదు పల్కులకును దానకె మగు
పున్నెముల పంట, పొడమె నా కన్ను గవకు. 74

ప్రణతు లొనరింతు వినతిమై రాధికా కు
చ స్థల శయనీయునకు, శేషశయను నకు,
నాల కాపరికిని, లోక పాలకునకు,
సిద్ధ తేజో విజిష్ణుఁడౌ కృష్ణునకును. 75

గొల్ల ప్రియురాండ్ర కుచముల కుంకుమంబు
నీల తను కాంతులకుఁ గడు నీటుఁ గూర్ప;
వేణు విద్యల కొజ్జయై వెలయు హరికిఁ
బ్రణతు లొనరింతుఁ బ్రణవ పూర్వకము గాఁగ. 76

అందెలు ఘలు ఘల్లని మొరయంగ లేత
యడుగుఁ దమ్ముల నొయ్యన నిడుచు, వాని
కను గుణంబుగ వేణు నిస్వనము లంపు
వన్నెగాఁడు, నా ప్రాణము, వచ్చుచుండె. 77

పెంపు సొంపారు కడగంటి వీక్షణముల
సొగసుగ నిగుడ్చి, నాదు చక్షువులఁ దనిపి,
వేణు రవళిచే వీనుల విందుఁ గూర్చు,
నఖిల లోక బాంధవుఁ డిదె! యరుగు దెంచె. 78

అవితథంబుగ దవు దవ్వులందు నుండి,
లీలఁ గడ గంటి చూడ్కుల చాలు పఱపి,
యధర మొగి మురళీ రవ సుధలు చిలుక,
మందగజ యానుఁడై డాసె నంద సుతుఁడు. 79

భువన మోహన కరములై మొరయు నగలు,
కులుకు లొలుకు చల్లనగు చూడ్కులు నటింప,
నాశ్రితావన చిత్ర పదాబ్జ గతులు
వేణు గీతి క్రీడన, డాసె వీఁడె! శౌరి. 80

మాని మనముల దొంగిలు జాణ యితఁడె!
గొల్ల చెలుల మానముఁ గొన్న కొంటె యితఁడె!
వ్రజి గర్వ మడంచిన ప్రభు వితండె!
నాదు హృదయాబ్జము హరించు నాథుఁ డితఁడె! 81

సర్వ భువనంబు లందున సాటి లేని
సరస ముగ్ధత్వ సకల విజ్ఞతలఁ దనరి.
కాంతి పుంజమా శ్రీకృష్ణుఁ గనెడు నాదు
కనులు, శాశ్వతా నందంబు ననుభవించె. 82

'ఇట్టి' - దని పలుకుల నిర్ణయింప రాక
చంద్రుఁ గ్రేడించు ముఖచంద్ర చంద్రికలను
హృద్గతా శాబ్ధి ద్విగుణీకరించి, నాదు
ప్రాణపదము, కృష్ణాఖ్య తత్త్వము వెలుంగు. 83

ఆశ్రితావనమై కరుణా రుణంపుఁ
గాంతు లీను కటాక్ష వీక్షణము, లధర
బింబ మమరు, కృష్ణ ముఖార విందమును, మ
దీయ హృదయ సారసము ముద్దిడుచు నుండె! 84

తమ్ములను జక్క దిద్దు కరమ్ము, లమర
తరు కిసలయాళిఁ గేరు పాదమ్ముఁ, లెల్ల
జగములను సాటిలేని లోచనము లొనరు,
బాల గోపాలు, నేత్ర పర్వముగఁ గనుఁడి! 85

దివ్యమయ్యె వింతగ దిన దినము హాయులఁ
గులుకుచు, నరుంధతిని నేనిఁ గలఁచు నగవు,
కంతుఁ డెద మెచ్చు మోహనాంగములుఁ దనరు
వ్రజసతీ కుచ తట గుప్తరాజ్య మిదిగో! 86

కులుకు లేఁబ్రాయ జవ్వనంబులు వెలుంగ
సొగసు మురువు చూడ్కులుఁ జిఱు నగవు నెగడ,
మురళి నొత్తుచు, నాసలఁ బఱపి, ముజ్జ
గముల వంచించు నా యేఁడు గడసు జయము! 87

చిత్ర మీ ధూర్తు పాద రాజీవ యుగము,
చిత్ర మీ స్నేహరస మొల్కు నేత్రములును,
చిత్ర మీ చిఱు నగవులు చిలుకు మోము,
చిత్ర మీ రూప, మెంతయుఁ జిత్ర ముంబు! 88

భువనముల నెల్ల సరిలేని భూషణంబు,
కలుముల వెలంది కులుకు గుబ్బలకుఁ దోడవు,
సతము వ్రేతల ముత్తెపు సరుల మురిసి
పెనయు మరకత నాయక మణినిఁ, గొలుతు. 89

"కచముఁ గొను పోరు"నన్ సిరి కుచము లురము
గదియఁ గాగిలఁ జెమరి మైగంద మంటఁ,
జిఱు చెమట చెక్కుటద్దాలఁ జిందులాడ,
నలరు, కృష్ణ తేజంబు కన్నులకుఁ దోఁచె! 90

మధుర, మీ విభు కాయంబు, మధుర మార!
క్రమ మకరంద గంధంబు గ్రమ్ము మృదుల
మందహాసంబు, మధురంబు, మధుర మార!
మధుర, మీ కృష్ణ తేజము, మధుర మార! 91

సకల శృంగార రస సుధా సార మొలుక
పింఛ మూని, లీలా నర వేష మలరి,
యఖిల జీవ సంతతికి నేకాశ్రయుండగు,
నంబుజాక్షు శ్రీకృష్ణు, సమాశ్రయింతు. 92

ఎట్టి ప్రాజ్ఞు లీ నాటికేన్ దృష్టి నేని,
స్వాంతమున నేని, వేదాంత సరణి నేనిఁ
గనని నీ రూప, మీ వాని కన్నుఁ గవకుఁ
జూపితివి కృపన్, గృష్ణ! నా సుకృత మేమొ! 93

ఏమి-శ్రీకృష్ణ! నీదు ముఖేందు కాంతి!
పలుకుల కగమ్యమైన రూపం బిదేమి!
స్వాదువగు-నది, సౌందర్య సంపద-యిది,
మ్రొక్కువాఁడను, మఱి మఱి మ్రొక్కువాఁడ. 94

నీదు ముఖచంద్రమునిచే వినిర్జిత మయి,
పది ముఖముల నీ పదములఁ బడి, విశేష
కాంతిలక్ష్మిఁ జంద్రుఁడు గాంచెఁ గాదె; ఔర!
యెంత కరుణా సముద్రుఁడ వీవు, కృష్ణ! 95

బహుళ పర్వ కలా భాగ్య బాహ్యమైన
చంద్రుఁ డెటుల నీ వదనంబు సాటి వచ్చు?
కృష్ణ! జగదేక లావణ్య మొసఁగు నీదు
మోమునకు నింకఁ బురుడింప నేమి కలదు? 96

తొల్లి కవి తల్లజుల శ్రేణిఁ దోఁచఁబోని
విధము సాహసించి వచింతు వినుము, కృష్ణ!
ఇందు, నారతి పళ్లెరం బందు నిలిపి,
నీ ముఖేందునకు నివాళి నీయవచ్చు. 97

దివ్య సుఖ రస ధార తెంతేని సతము
నించి, యన్య రసంబు లడంచి, మించి,
కొలఁది యిడరాని యమృతము లొలుకు నీదు
చల్లనగు చిఱు నగవు వర్ధిల్లుఁ గృష్ణ! 98

సుందరులును రసజ్ఞు లెందెంద రేనిఁ
గలుగుదురు గాక, వారితోఁ గలహ మేల?
వారిమెప్పేల? నిజ మనువాఁడ, గృష్ణ!
చక్కఁదనముల మేర నీ వొక్కరుఁడవె! 99

అమర తరు తల మందు నొయ్యారముగను
నిలచి, గోగోప గోపికల్ బలిసి కొలువ,
మురళి నూఁదుచు, వలరేని మురువు గులుకు
వ్రజ సుధాకరు, గోప డింభకునిఁ దలఁతు, 100

సిగ్గు విడచి వ్రేతలు రతి స్థితినిఁ గనిరి,
వంశి తేనెలు గురిసెఁ, జాపలత సొంపుఁ
దాల్చె, మూఁబోంట్ల పలుకు సార్థకత నొందె
నీ కతనఁ గృష్ణ! నాదు పున్నెము ఫలించె. 101

భువన మెల్ల నీదు భవనంబు, లక్ష్మి య-
ర్ధాంగి, తనయు లంబుజాసనాదు,
లనుచరులు సురేశ్వరాదులై తనరు నీ
కేల జార చోర వృత్తి? కృష్ణ! 102

నిఖిల సౌభాగ్య సంపదల్ నెలవు భువన
సుందరాంగికి నుదుటి కస్తూరి బొట్టు,
వ్రజ తలోదరీ సురత విభ్రమము సరస
రీతిఁ బలుపు కృష్ణుండు, వర్ధిల్లు గాత! 103

ప్రేమదంబు, సకల కామదంబును, సర్వ
వేదనంబు, వివిధ విభవదంబు,
జీవనంబు, నాదు జీవితంబు, నుపాస్య
దైవతంబు, సర్వ మీవ, కృష్ణ! 104

నీదు లీలా విభూతి వర్ణించు నాదు
పలుకు లమృతంపు సోనలై యలరుఁ గాత!
శైశవ క్రీడలఁ దలంచి సంతతంబుఁ
దలఁపు లుప్పొంగుఁ గాత, రాధా కళత్ర! 105

ఎవని చరితామృతము నాల్క కింపు నింపు
నెవని గడుసు చెయ్వులు రాధ కేవఁ బెంచు,
నెవని వేణు గీతులు లోక మెల్లఁ దనుపు,
నతని సకల శోభలు, మది నలరుఁ గాఁత! 106

మాదు నోముల పంటవై, మహిని గోప
బాలుఁడ వగు నీపయి దృఢ భక్తి గదిరె
నేని, మోక్షంబు దాన వరించు ననిన,
నితర పురుషార్థముల మాటలేలఁ కృష్ణ! 107

జయము! దేవ దేవాధీశ! జయము! జయము!
త్రిభువనావన కర నామధేయ! జయము!
శ్రవణ హృదయ నేత్రామృత స్వాదురూప!
జయము! శ్రీ రాధికా కృష్ణ! జయము! జయముఁ! 108

అవ్యయానంద పారవశ్యమునఁ జొక్కి,
యాసగను సుకృతాత్ముల నలరు నదియు,
వ్రజము తోడవు, పల్కుల కందరాని మురళివు
వెలుఁగు నీ తేజానకు నమస్కృతులు; కృష్ణ! 109

హార పద విభూషణుండు, శ్రీహరి యశస్సు
ధాస్వాదన సూరి, లీలాశుకానుకారి.
హానుమ పలుకు శ్రీకృష్ణ కర్ణామృతంబు
నందు, ప్రథమ బిందువు భక్తులాన రండు! 110

శ్రీకృష్ణ కర్ణామృతము ప్రథమ బిందువు

సమాప్తము.

శ్రీకృష్ణార్పణమస్తు.

ఓమ్

నమో భగవతే వాసుదేవాయ

శ్రీ సాయీనాథాయనమః

# శ్రీకృష్ణ కర్ణామృతము

## ద్వితీయ బిందువు

---

పచ్చి వెన్న జిడ్డును, పాల వాసనలను,
పెరుఁగు తుంపురుల్, మేనికిఁ బెంపు నెఱ;
నెల్ల జగముల కొనరెడి యిడుమ లడఁచు
పింఛమౌళి పూరించు మా వాంఛితముల.

యమున యని దప్పి పెల్లున నాలు డాయు,
నంబుద మని నెమిళులు తమకంబుఁ బూనఁ,
గానుగు చివుళ్లనుచు గోపికలును గిల్లఁ,
బొలుచు కృష్ణు మై నిగ్గులు ప్రోచు మమ్ము.

యమున విమలాంబువుల స్నానమాడు గొల్ల
చెలుల చేలముల్ నాచిన సిగ్గు నొంది,
మరులు పొడమఁజూపు లొకింతఁ బఱపి, కన్ను-
దమ్ముల యజింప నలరు, మాధవుఁడు ప్రోచు.

చెడ్డ పొట్టకై, ఖలుల పాల్వేసితి, నిను
నైపఁ గదే! వాణి, సరళ వాత్సల్య మూని;
జనని! దోష నిష్కృతి నిదె, సలుపు వాఁడఁ,
గృష్ణ కల్యాణ గుణ గణ కీర్తనమున. 4

అరుణ రుచు లీను మునివ్రేళ్ల మురళిరంధ్ర
ములను గప్పుచు విప్పుచు మోవి నూది,
త్రిగతి నిల్చి, నేత్రాబ్జ దీధితులు పఱపి,
వ్రజమునఁ జరించు గోవిందుఁ బ్రస్తుతింతు. 5

సరస వేణు నిస్వనములఁ బఱపు వాని,
నాల మేపు వానిని, నిగమాంత వీథు
లందుఁ జరియించు వాని, భయాపనయను,
గోపికా జారు, రసనంబ! కొలువఁ గదవె! 6

పురిని జడకొన సొంపుగఁ జెరివి, మబ్బు
మెఱుఁగుఁ గను మేద దువ్వల్వ మెఱపు కరణిఁ
బొనర, లేఁత తొలసి దండ బూనఁ దాల్చి,
కలను వెన్నుఁడు సిరిఁ గూడి, కానఁ బడియెః. 7

వసనముల నాచి, నదితట వనజ మెక్క,
ముగ్ధ గోపిక విసుగొంది, భ్రూకుటియును,
జిఱునగవు, సిగ్గుఁ, బ్రేమయుఁ జెలఁగ,ఁ బట్టె
నీట, నీ చేతి చేలము నీడ,ఁ గృష్ణ, 8

యమున తటవనిఁ బుట్టి ధన్యత్వ మొందె
నందనందను కెమ్మోవి పొందుఁ గాంచి
యీ మురళి, నఱుజన్మ మందేని, నెల్ల
పున్నెములు పండి నాకట్టి పుట్టు వున్నె? 9

మనమ! తమ్మి రేకులఁ గేరు కనుల వాని,
సిగ ముడిని నెమ్మిపురి దండ నెగడు వానిఁ,
బ్రామిను కుల ప్రాపునుఁ బ్రజ భాగ్యమైన
శ్యామ సుందరాంగుని పొందు నందఁ గదవె, 10

మురళి! నీ వెంత ధన్యవో! యెఱుఁగ,ఁ గృష్ణు
చిఱు నగవు లీను మోము దామరను వెడలు
నూర్పు తేనె లానెదు; మోవి నూదు వేళ
నన్ను హరి కెఱిఁగింపు; వే నతులు నీకు! 11

జలద నీలు, వ్రజాంగనా సంగ లోలు,
స్వర్ణ చేలు. శ్రితామర శ్యామజ మూలు,
అసుర కుల కాలు,ఁ బరమ దయాల వాలు,
ప్రణుత సురముని జాలు, గోపాలుఁ దలఁతు. 12

కెంపు నిరసించు మోవియు, నింపుఁ గూర్చు
మురళి నినదంబు, సుందర ముఖ సరోజ
మమర, నిట్టట్టని వచింప నలవి కాని
చిన్న గొల్ల బిడ్డని నుపాసించు వాఁడ. 13

మోవి యందునఁ బిల్లనగ్రోవి నుంచి,
వ్రేళ్ల రంధ్రముల్ గప్పుచు విప్పుచును, నొ
య్యారముగ రమ్య బృందావనాంతరమున
మధుర గానముల్ పలికె, మా మాధవుండు. 14

నోట వెన్న వాసనలను, మాట లందు
దొంగతనపు నేర్పులుఁ. గను దోనల యందు
కల్ల కన్నీరు లురలఁగ, నల్ల నల్ల
నడుగు లిడి యాడు శ్రీకృష్ణు, నాశ్రయింతు. 15

యమున తట మందుఁ బుట్టు దవానలంబుఁ
ద్రావి గోప గోపికలను బ్రోవఁ గలిగె
నంట! నిరతంబు దన్ను సమాశ్రయించు
మమ్ము రక్షింపఁ దలఁపఁడే? మాధవుండు. 16

జగములను బొగ డొందిన జారుఁడయ్యు
నాగ మాంత వచో వేద్యుఁడైన వాఁడు;
లలిత హరి నీలమణి దేహ మలరు వాఁడు,
గొల్లవాఁడు, మా యశుభము లెల్ల నడఁచు. 17

ఆగమ శిరంబునను, ముని స్వాంతములను,
సరస వ్రజ సుందరీ పాద సారసములఁ
జెలఁగు జగదభి రామైక సీమ, గోప
బాల రూపము గూర్చు, మా వాంఛితముల. 18

విరివియగు కనుల్, జాఱిన కురులుఁ, గెంపు
సొంపొదవు పెదవియు, మేల్మి సొమ్ము లొనర,
దిన మొలయు నల్లనగు మేనుతేజు లొలుకఁ
బొలుచు చిన్న గొల్లని కిదె మ్రొక్కు లిడుదు. 19

మొఱయుఁ జిఱు గజ్జియలు కర చరణములను,
వ్రేలఁ- బంగరు మొలనూలు పిరుదు లందుఁ,
గ్రాల-చిప్ప కూకటి యందు రావి రేక,
కులుకు-వసుదేవు భాగ్యంబు, గొలుచు వాఁడ. 20

బృందపాద పచ్ఛాయ, గో బృందములను
నిగమ వీథుల యందున నెగడు వాని,
వేణునాద వినోదునిఁ బింఛమౌళిఁ,
జలదనీలు శ్రీకృష్ణు, నే సన్నుతింతు. 21

చరణముల మార్చి, సిగముడిఁ బురినిఁ జెరివి,
మొగము నోరగ నిడి, మోవి మురళి నూఁది,
కరుణ దొలుకాడు శ్రీకృష్ణు పరమ తేజ
మలరు నామ్రోలఁ బ్రాణ ప్రయాణ వేళ. 22

వ్రేతలకుఁ బ్రీతి నిడ నవనీత చోరుఁ
బట్టి, నడుముఁ గవ్వపుఁ ద్రాటఁగట్టె రోట;
ముజ్జగంబులు వెన్నని బొజ్జ నుంటఁ
దల్లడిల్లి, కూయిడె నెత్తితల్లి పనికి. 23

సతము పంచాక్షరీ మంత్ర జపము సలుపు
శైవులము మేము; యగుఁగాక, స్వాంత మెపుడు
నల్లవిపె పూల తేజును నవ్వు మొగము
పొలుచుఁ శ్రీకృష్ణుఁ జింతింప వలచు నౌర! 24

కృష్ణ పరశవ చిత్తయై రిత్త కడవ
చిలుకు రాధిక, కులుకు చనుల
వలచి పాల్పితుకగ వృషభమును జేరు
కృష్ణుఁడును, లోకములను రక్షింత్రు గాత! 25

గోపద పరాగ శోభిత కుంతలాగ్రు,
నతుల గోవర్ధనోద్ధరణైక లీలు,
గోపికా జన కుచ కుంభ కుంకుమాంకు,
నబ్జ వదను, గోవిందు, సమాశ్రయింతు. 26

ఏఁడు మున్నీరు లేనియు నెవని రోమ
కూపములను బూరింపఁగా నోపవయ్యె
క్రోడ రూప మం, దాప్రోఢ, నేఁడు దోఁగె
నీ యశోద దోయిటి నీట! మాట? 27

నిగమ వనముల శ్రమ నొంది నెమక నేల?
ఆదదింపుఁ డే నొక రహస్యము వచింతుఁ;
గనుడి, గొల్ల యిండ్లను రోటఁ గట్టు వడియె
సకల వేదాంత లక్ష్యమా శ్యామమూర్తి. 28

సతము నందనందన పూజ సలుపు వాని,
గోపబాలు పాదాంబులఁ గ్రోలు వాని,
విజయ సారథి స్తవము గావించు వాని,
నన్ను శమన కింకరులే మొనర్పఁ గలరు? 29

జనన మరణ భవ వ్యాధి శాంతిఁ గూర్ప
తవనిఁ బరమౌషధము నా, స్వాయంబ పోలుచు
నంద మందిరానందు సౌందర్య వేష,
మలరు, గావుత! నా మది ననవరతము. 30

కడిమి పూల గుత్తులు వ్రేలఁ గర్ణములను,
జెక్కుటద్దము లెఱ్ఱనై చెలువుఁ గూర్పఁ,
దొలి పలుకుల కేనియుఁ దెల్ప నలవి కాని
నల్లవానిని, వీక్షింతు నెల్ల యెడల. 31

కలువలను గేరు కనులోరఁ గాఁగఁ బఱపి,
చిగురు జేగురా మోవిని సగము మోడ్చి,
వ్రేళ్ల మొనలు నేరుపున వేవేగ మెలపి
యలరు వేణునాద రసజ్ఞు, నాశ్రయింతు. 32

గరుడ టెక్కెముఁ గూర్చిన యరద మందుఁ
గుండిన పురాధిపు ననుంగు గొమరినిఁ గొని
యరిగెడిఁ దమాల పల్లవ శ్యామలాంగుఁ
డొకఁడు; చని, పట్టుఁడీ! నేరుపున్న వారు. 33

తెరువరులు! భీమరథి దఱి కరుగఁ బోకుఁ,
డచటఁ గలఁ డొక నీల దిగంబరుండు;
కటితటినిఁ జేతు లున్నట్లు గానఁ బడియు,
ధూర్తుఁడై, చిత్తధన మెల్ల దొంగిలించు. 34

శ్వేత శ్వేతల నడుమను గృష్ణుఁ డొకఁడు
కృష్ణ కృష్ణుల నడుమను శ్వేత యొకతె
చేరి, వలయాకృతిని నిల్వ, వారి మధ్య
మురళి మొరయించె గోపికా మోహనుండు. 35

కేకి కేకల వినుడుఁ, బంకేరుహముల
బాయు రాయంచగములు విభ్రమముఁ బాసి,
మోద మందఁగ, వ్యత్యస్త పాదుఁ డగుచు
మురళి మొరయించె గోపికా మోహనుండు. 36

వీణ కనుగుణంబుగఁ దాండవించి యొకటఁ,
గింకిణుల్ వీణ ఫణితి మ్రోగించి యొకట,
నీణ కనుగతి గీతిఁ గావించి యొకట,
మురళి మొరయించె, గోపికా మోహనుండు. 37

వలపుఁ గొలుపుచు సతులు చూడ్కులు నిగుడ్ప,
నెల్ల గోగోప గోపిక లింపు నెఱప,
వల్లవీ దైవమై, ప్రియ వల్లభుఁడయి,
మురళి మొరయించె గోపికా మోహనుండు. 36

క్రమ్ముకొను సిగ విరిదండ తుమ్మెదలకు
బెదరి, కౌగిలఁ, జేలముల్ చెదరి, ప్రియులు
కటకు గుబ్బల నొత్తుచు మరులు పెనుప,
మురళి మొరయించె గోపికా మోహనుండు.

హేమ కాంతిని నిరసించు భామఁ గూడి,
వైజయంతి వక్షస్థలిఁ బరిమళింప,
నంద బృందావనాంగనానంద మెసఁగ,
మురళి మొరయించె గోపికా మోహనుండు.

తాళముల వేయు బాలికా తాళ లయల
దిద్దఁ గనుబొమల్ నీటుగఁ ద్రిప్పి, వారి
గీతికలఁ జక్కఁగా నాలకించి, మించి,
మురళి మొరయించె గోపికా మోహనుండు.

సత్యభామ ముంగిటఁ బారిజాత మొవఁడు
నాఁటు నామేటి రాధా వధూటిఁ గూడి
జమున దటి శీతల వటచ్ఛాయ నిలచి
మురళి మొరయించె గోపికా మోహనుండు.

అదియె, సఖ! మద్ది, దానికి నవల వ్రజము
బాట, పొమ్ము; వ్రేపల్లె కావలనె యమున,
యమున దటిఁ గదంబవన, మందాడు నాల
మేవు బుధుత,ఁ డాతఁడు, నీకుఁ జూపు సుగతి.

గోపద రజంబు గ్రమ్మిన గోప బాల
వేషుఁడయి బృందఁ, జెలికాండ్రు వెంబడింపఁ
గ్రేపులను గట్టి నిల్లిల్లు మాపులందుఁ
జనెడి, యచ్యుతు నిత్యంబుఁ బ్రణతి సేతు. 44

తళుకు బెళుకుల తావు, చోద్యముల ప్రోవు,
అందముల నిధి, యవ్యయానంద జలధి,
అమృత రసధార, సతుల పున్నెముల మేర,
బుధ ఫలము, జగన్మూలమా బుడుతఁ గొలుతు. 45

లీలఁ గేలు దమ్మిని మునికోలఁ బూని,
రత్న కుండల హేమ సూత్రములు గదల,
శ్రమ జలము దోఁప, నంబుద శ్యామమైన
పార్థ రథ భూషణమ్ము, గాపాడు మమ్ము! 49

తలను మునికోల, పగ్గముల్ దంతములను
బట్టి, యంగముల్ నిడిగించి పార్థు తురగ
ములను గోకి, దోయిటి నీరములను గడుగు,
దేవకీ పుణ్యరాశి, నన్ బ్రోవు నెపుడు. 47

వ్రజ కుమారీ సహాయు, నభ్రనిభ కాయు,
శుభచయ విలాసుఁ, గల్ప ప్రసూన హాసు,
నత కమల భాను, నంద భూనాథ సూను
పదములను జేరి మనెదు, నా హృదయ మెపుడు. 48

అమృత రస మొల్కునగు మోవియందు వెడలు
మురళి రవళిచే వని మ్రోళ్లు మొలక లెత్త,
నడుగు లంటి-పుడమి గగుర్పడఁగఁ బొలుచు
మొదటి రక్షకు, సౌందర్యమూర్తిఁ గొలుతు. 49

వేణు రవళిచే వ్రజమెల్ల వివశ మొంద
సలిపి, యువకుల కేనియు వలపుఁ గొలుపు
నీల మోహనాంగంబుల నిగ్గు దేరు
వల్లవీ వల్లభుని, మదిఁ బ్రస్తుతింతు. 50

వ్రేమిటారుల మరుకేళిఁ బెనఁగ హత్తు
చిన్నె లాడలికి నెల్లెడ వన్నె నెఱప
నతి పవిత్రుఁడై, శ్రుతుల కెందంద రాని
యాద్యు, నవనీత చోరు, నే నాశ్రయింతు. 51

వెన్నదొంగ నింటను గని, వ్రేత-తలుపు
ముగిడిచి, యశోదకున్ దెల్పఁబోవ, నచట
ఱోటఁ ద్రాటిచే బద్ధుఁడౌ మేటిఁ గాంచి,
భ్రాంతివడు నాపెఁ గని, నవ్వు ప్రభునిఁ గొలుతు. 52

జానువుల దోగుచును మణి స్థలమునందు
మోము ప్రతిబింబమును గని, తామరయని
దానిఁ గొనఁబోవ, రాకున్న-దాదిఁ గాంచి,
వగపు పెంపున నేడ్చెడి ప్రభుని,ఁ గొలుతు. 53

మాత ముద మొంద, గోపికల్ మరులు పెనుప,
శక్రి శంకింప, సురలు పుష్పములు గురియ,
ధరణి కలఁగ, గోపకు లీర్ష్య, నొరులు దయ వ
హింప, గోవర్ధనం బెత్తు కృష్ణు నెంతు. 53

ఆత్మ విదులైన ప్రాక్తను లనవరతము
హృదిని వెలుగొందు పరు నుపాసింత్రు గాక!
కృష్ణ బాల లీలా కథామృత పయోధి
నోల లాడెద మేమెల్ల వేళ లందు. 55

పెరుగు పాలమ్మ కొనఁబోయి, వ్రేత యొకతె
యాత్మ యందు గోవింద పాదార వింద
ములను దలఁచుచు, వీథులన్ మోహ వశత
కేకలిడె,-"హరి! గోవింద! కృష్ణ!" యనుచు. 56

కృష్ణ మత్తగజంబు బంధింప నిక్క-
మొదవు,ఁ గట్టు కంబములయి యొకటి రెండు;
ఇల యశోద ఱోలేన్, ముని హృదయ మేని,
నిగ్గు గను వ్రేనెలఁత చను మొగ్గ గాని. 57

కర సరోజంబుచేఁ బాద కమల మూని,
సొగసుగ ముఖాంబుజంబునఁ జొనిపి, మఱ్ఱి
యాకువను బవ్వళింపుచు నాడికొనెడి
కృష్ణుఁ, బ్రేమ మయున్, సంస్మరించు వాఁడ. 58

"స్వాగతము- శివ! అజ! రమ్ము;- శక్ర! కుశల
మా? కుమార! భద్రమ?- సుఖమా? కుబేర!"
యనుచుఁ గలఁబల్కు- సుతుఁ గాంచి, జనని వెఱచి,
సలుపు 'థూ' 'థూ' కృతుల్ మమ్ము, సాకుఁగాత! 59

అమ్మ!- ఏమిరా? కృష్ణ!-పాత్రమ్ము నిమ్ము;
ఏల? - పాల్ద్రావ; - లేవిప్వు; - డెపుడు? - రాత్రి;
యనినఁ? - జీఁకటి పడ; నాగఁ గనులు మొగిచి,
"నిశి పొలిచె గిన్నె"ఁ దెమ్మను శిశువుఁ గొలుతు. 60

"ఆడుకొని బలుఁ డరుదెంచు నంతలోనఁ
గ్రోలు పాలను; పెరుగు నీ కురులు మిగుల"
నని, జనని యిడ సాఁబాల నారగించి,
కేశములఁ జూచికొను-జిన్న కృష్ణుఁ దలఁతు. 61

వెండి కొండను వెన్నగఁ, బృథివి మన్న
టంచు, క్షీరాబ్ధిఁ బాలుగ నరసి నోట;
"అఱక మిది, కటా! చిరజీవి వగుము! కృష్ణ!"
యను,యశోద"థూ!థూ!కృతుల్"-మనుచుమమ్ము 62

కన్నులఱ మోడ్చి మఱిరొుక చన్ను నొని,
తొలి కుచముఁ జేఁత నిమురుచుఁ, దళుకు చెక్కు-
లింపొదవు తల్లిమోఁట, హసించు కృష్ణు
పాల పన్నుల రుచులు, మమ్మేలుఁ గాత. 63

పెండ్లి వేళను దలవంచ, వ్రేలు కంఠ
హార నాయకమణిఁ దోఁచు శ్యామలాంగుఁ
గాంచి, కోరిక లీడేర,ఁ గరము సంత
సించు శ్రీకాంత మమ్ము రక్షించుఁ గాత! 64

"కృష్ణ! మను దింటివా?–తల్లి! యెవ్వ రనిరి?
యన్న యనెఁ; "గల్లయది,–నమ్మకున్నఁ జూడు"
మనుచు నోరును దెఱచి బ్రహ్మాండ మెల్ల
జననికినిఁ జూపు కృష్ణుండు। మనుచు మమ్ము. 65

స్వాతి ముక్తా ఫలంబులఁ బడసె ననుచు
సవతిఁగని। సైచలేక రోసమునఁ గాంచ
నోప! శశికాంత రోహిణి, గోపకామి
నీల సత్కుచో పరిహార నీలమణిని. 66

ఇంపు లొలుక నృత్యము సేయు కృష్ణు రూపు
మెదుటి రతన కంబమున నీక్షించి, దానఁ
జెలఁగు వ్యామోహమున,ఁ దల్లి, చేతనున్న
వెన్నముద్ద నిద్దఱఁ బంచి పెట్టఁ బోవు! 67

"లెమ్ము! తెల్లవారెను–మేలుకొమ్ము–చిన్న
కృష్ణ! పదివేల యేండ్లు వర్ధిల్లు! మనుచు,
నిద్దురను లేపి, జనని యా ముద్దు మొగముఁ
బెద్దయుం బ్రొద్దుఁగన,–నవ్వె వెన్న,ఁ గొలుతు. 68

బిడ్డఁడని ప్రేత ముద్దిడ-ఁ బెదవిఁ గఱచి,
ప్రేమఁ గౌఁగిలింపఁగ- మెడ బిగియ నొక్కి-,
యొడిని జేర్ప,-మర్మ స్థలుల్ తడవఁ జూచు,
ధూర్త గోపాలుఁ డఘములఁ దొలఁగఁ జేయు! 69

జానకినిఁ బాయ లక్ష్మణా! జలదములు,ఁ గ
దంబ వాయువుల్ నన్నుఁ గరంబుఁ గలఁచె,"
నంచు,-ఁ దొలిబాము కత నిద్రనాడ, రాధ
కీసు జంకు లెలయ, నవ్వ కృష్ణుఁ దలఁతు. 70

పూతన యడంగె నానకు-మోవి నింక;
ముద్దులవి కూలెఁ గౌఁగిలీవద్దు-విడుమ;
కనక కశిపుఁ డీల్గెను గోటఁ జెనకఁ బోకు,"
మనెడి సిరిఁగూడి, క్రీడించు హరి,ఁ దలంతు, 71

నిద్రఁబుచ్చ జనని, "రామభద్రుఁడుండె,
నతని సతి సీత; తండ్రి యానతిని నటవి
నుండ,-సతినిఁ గొంపోయె దైత్యుఁడన- "ననుజ!
విల్లు-విల్లు-దె"మ్మని లేచు, వెన్ను, దలఁతు. 72

రాధ కనుసన్న మెలఁగు-ధీరమతి వీవు,
సంసరణ బంధ మడఁగించు-జారుఁ డీవు,
నిబిడ తమ మడఁగించెడి-నీల మిావు,
కేల నగమెత్తు శిశువీవు-కృష్ణదేవ! 73

దిస మొలయుఁ దల్కు గజ్జె లింపెసఁగు కటియు,
నల్లనగు మేను, సొబగారు గొల్ల కొలము
సొమ్ములను దాల్చి, వెన్నలఁ జూఱఁ గొనెడి
నందనందన! నీకు, వే వందనములు! 74

ఒక్కచేఁ బాయసాన్నము; జక్కఁబట్టి,
యొకట హైయంగవీనము నూని, కంత
మందుఁ బులిగోరు పేర్లు చెన్నొందు మా య
శోద ముద్దు బిడ్డఁడుఁ, మాకు సుఖము లొసఁగు! 75

కరము లందునఁ గడియముల్ మెఱయఁ, నడుగుఁ
దమ్ము లందెల కుణుకుణు ధ్వనులు నెఱప,
కిణికిణి నినాదములను గింకిణులు బఱప
నందు ముంగిటఁ బ్రాకు ముకుందుఁ గొలుతు. 76

అంబ తను బట్టికొన నెంచి వెంబడింప,
నాలమంద దూఱుచు నాపె కలపుఁ గూర్చి,
ముంగురులు మొగంబున వ్రేల బురద యొడలి
తోడఁ జెలువొందు ప్రోడను, వేడువాఁడ. 77

సిగను సొబగైన పింఛము చెలఁగు వాఁడు,
గోపికల వలపులు కొల్లఁగొన్న వాఁడు,
మోవిఁ బిల్లన గ్రోవినిఁ బూను వాఁడు,
గొల్లవాఁడు, నారక్షకుఁ డెల్ల యెడల. 78

కరుణఁ గురియుచుఁ బ్రహ్లాదుఁ గనిన వాఁడు,
నిగమనగ గుహాంతర మందు నెగడు వాఁడు,
శ్రిత సుర త్రాణుఁడును, నరసింహ రూపుఁ
డైన పరతత్త్వమును హృదయమునఁ గొలుతు. 79

సంసరణ బాధఁ దొలగించు సాధనంబు
అమల కంసారి పాదాంబు జార్చనంబు;
భూరి మోహాంధకార విమోచనంబు
'శివ' పవిత్రాక్షర ద్వయ చింతనంబు 80

నిఖిల గోప మందిర నవనీత చోరు,
నిందిరా సుందరీ మణీ హృద్విహారు,
వ్రజ పురాధిప నంద గోపక కుమారు,
గోపికాజారు, వినతి మ్రొక్కుదు, నుదారు. 81

"ఎవఁడవో?-రాము తమ్ముఁడ,-ఇటనియేమొ?-యిల్లు
పొరపడితి;-మంచి! దా, వెన్నముంత దేవె
దేల?-మా లేఁగ నెమక నే తెంచి, తమ్మ!
కెనల" కని, వ్రేతతో, బల్కు-గృష్ణుఁ గొలుతు. 82

క్రతువులకుఁ బోవు-వ్రేపల్లె గంతు లిడెదు!
స్తుతులఁ జెవినిడ, వాల హుంకృతుల వినెదు!
సేవఁ గొనవు-గోపికలకు సేవ సేతు!
ప్రేమ మూలము-నీదు ప్రాప్తికిని, కృష్ణ! 83

ధన్య చారిత్రయాయశోదా పయోధ
రామృత నిషేవణమునఁ జోద్యముగఁ బెరిఁగి;
రాధికా ముఖాంబుజ మకరంద దివ్య
పాన తృప్తుఁడౌ, గోపాల బాలుఁగొలుతు. 84

సకల శుభముల నొడఁగూర్చఁజాలు మాధ
వావతారము లవి పెక్కు లమరుఁ గాక;
ప్రేమఁ బఱపి, గోగోప గోపికల కెల్లఁ
గృష్ణుబలె ముక్తి సులువుగ నిడిన దేది? 85

అందియలు, గజ్జియలుఁ, గడియములు, రావి
రేక పులిగోళ్లుఁ, జెలువొంద, రేప కడలఁ
బాడి యావుల మందలోఁ బరువు లెత్తు
బాల శుభకలా సహితు, గోపాలుఁ గొలుతు. 86

జలద నీలు నమానుషా చరిత లీలుఁ
బాణిధృత శైలు, వేణు నిస్వన రసాలు,
వల్లవీ కేళిలోలు, గోపజన పాలుఁ
బరిమళాంచిత వనమాలు బాలుఁ దలఁతు. 87

అనుపమ కపోలు, వేణు నిస్వన విలోలుఁ
జలితలంబ చికుర జాలుఁ జౌర్యలీలు,
సమర రిపుకాలు, శాత కుంభాభ చేలు,
వనద నీలు, గోపాలక బాలుఁ దలఁతు. 88

వేణు రమ్య నినద లోలుఁ, బింఛ చూళు,
దళిత దేవతా రిపుజాలు, ధన్యలీలు,
ఆన్యహిత నవహేలుఁ, బద్మానుకూలు,
వారిధర నీలు-గోపాల బాలుఁ, దలఁతు. 89

సచ్చిదానంద కాయుఁ, బ్రశమిత మాయు,
ననఘు లక్ష్మీ సహాయు, సద్గుణ నికాయు,
గళిత సర్వాంతరాయు, యోగసముదాయు,
బ్రాజ్ఞ జనదాయు, గోపాలరాయుఁ, గొల్తు. 90

అబ్ధికన్యా కళత్రు రమ్యాబ్జ నేత్రు
నిందు సన్నిభ వక్త్రు, సురేశ మిత్రు,
నతి మనోహర గాత్రు, దయైక పాత్రు,
వినుత వసుదేవ పుత్రుఁ, బవిత్రుఁ, గొలుతు. 91

మించి, యమున తోయముల లంఘించి, కడు మ
దించు కాళియ గర్వ మడంచి, సురల
నొంచు నక్తంచరులను వచించి త్రుంచు
ఫించమౌళి, పూరించు! మా వాంఛ లెల్ల. 92

పురిని సిగయందుఁ గస్తురి బొట్టు నొసట
ముక్కునన్ ముత్తియము, కర్ణములను కమ్మ
లమర, సుమదామ హేమ చేలములఁ దాల్చి,
మురళిఁ బలికించు-కృష్ణుండు, ప్రోచు! మమ్ము. 93

యమున జలకేళి వ్రేజవరాండ్రు సలుపఁ
జీరలీవు నాచినఁ, గృష్ణ! చేడెలెల్లఁ
గురులఁ గొందఱు, కొందఱు కరయుగమునఁ,
గనుల మోడ్చి కొందఱు, సిగ్గుఁ గప్పి కొనరె? 94

ఎవని ముక్కు ముత్తియ చటలేరు నందు
గోపికల బెళ్కు చూపులు చేపలయ్యె!
నడుగుఁ దమ్ములఁ గనుడు నీలాలకములు
భ్రమరములు నయ్యె! నట్టి, గోపాలుఁ, గొలుతు. 95

వేణు గానము విననెల్ల, ప్రేమలుడిగి,
చెదరి వ్రేలెడి ముంగురు, లదరు మోవి,
కులుకు గుబ్బలు, మేనుల పులక లొలయ,
దఱియు వ్రేతల మనుచు మాధవునిఁ దలఁతు. 96

అమల దేవకీ గర్భాకరమునఁ బొడమ,
కూతు వెలకు నందున కబ్బి, గోపకామి
నీ విభూషణమూ, గోపని చయహార
తరళ నాయక నీల రత్నమును, గొలుతు. 97

బాలకుఁడు పీఁట నెక్కి, నవ్వాని మీఁద
నిలచి, యుట్టి గంటలఁ బట్టి నిలిపి, పాల
కుండ వంచిఁ దోయిటఁ ద్రాగుచుండఁ డాయు
వ్రేత కనులఁ బాలుమిసి, తేసితి? కృష్ణ!

తపములును, సాధు సేవలు, దానములును,
జన్మము లెవేవి తొలిమేన సలిపినానొ!
యొనరె నీనాడు, భవభీతి నణఁచి యెల్ల
శ్రేయములఁ గూర్చు రాధికా కృష్ణభక్తి. 99

ఈవు కరుణింప నా గుణాలేమి సేయు?
కరుణఁ గనవేని నా గుణోత్కరము లేల?
ఇష్టుఁడై నను నాథుఁ డనిష్టుఁడైన
నింతులకు గంధపుం బూతలేల? కృష్ణ? 100

నడుమ లసియాడఁ, బయటలు వడిని గదలఁ,
గడియములు మ్రోయ నవ్వు మొగంబు లొలుకఁ,
బెరుఁగు జిలుకుచు వ్రజమున వేకువలను
వ్రేనెలంతలు గీర్తించు కృష్ణుఁ దలఁతు. 101

మోవి నటు మోడ్చి, బొమలు వంపుఁ గని నిక్కఁ,
గులుకఁ జూపులు, వామ కుండలము మూఁపు
నాన, మువ్వంకగా నిల్చి, యమర తరువు
మ్రోల మురళి సొంపుగ నూదు బాలుఁ, గొలుతు. 102

మల్ల భువి నిల్వ శైలమై మల్లురకును,
సతుల కతనుఁడై, బాలుఁడై యితరులకు; న
గారి కీశుఁడై, శమనుఁడై కంసునకు, య 103
తులకు ధ్యేయమూర్తిగఁ బొల్చు దొరను గొలుతు.

రత్న పీఠస్థుఁడై యొడిన్ రాధ నునిచి,
తిలకమును దిద్దుచును గుచంబులను దాఁకి,
మరులు గొని చిఱు నగవు లొండొరులుఁ బఱుప
వెలయు శ్రీకృష్ణు, గోపికావృతునిఁ, గొలుతు. 104

పైఁటఁ దిగువ సిగ్గునఁ దలవంచి, నల్ల
కలువ కంటి నిగ్గులు పైడి తళుకు చనుల
మావి చివుళుల గతిఁదోప మందహాస
మొసఁగు రుక్మిణిఁ గాగిలు కృష్ణుఁ దలఁతు. 105

"కృష్ణ! యొక గిరిన్ గేలఁ బైకెత్తు మాత్ర
నబ్బె గోవర్ధనోద్ధారుఁ డనెడి బిరుదు !
ముజ్జగము మోయు నినుఁ జనుమొన ధరించు
నను గణింపరే?" మను రాధికను, నుతింతు. 106

సంధ్య! మేల్కొను; మ్రొక్కులు, స్నానమా? క్ష
మింపుఁడీ కర్మలార ! కావింపఁ జాల;
ఎందొ వసియించి, శ్రీకృష్ణు నెడఁద సంస్మ
రించి, యఘము లడంతు; వేయేల నాకు ? 107

కృష్ణ ! కరుణాంబు రాశి ! లక్ష్మీ కళత్ర !
కరి వరద ! గోపికాలోల ! కంసనాశ !
అఖిలలోక గురూ ! జలజాయతాక్ష !
నిన్నుఁగా కేరి నెఱుఁగ; మన్నింపు, తండ్రి ! 108

నుదుట కస్తూరి తిలకంబు, నెదను కౌస్తు
భంబు, నాసక తుది ముత్తియంబు,c గరము
నందు వంశంబు, మేన గందంబు లమరు
వల్లవీ సేవ్యుc డైన గోపాలుc, దలcతు. 109

వేదముల్ మ్రోయc లోకముల్ వివశ మొంద
రాల్గరగ, మ్రోళ్లు మొలువ, హర్ష మునc జొక్క
మృగము లావులు, గోపకుల్ మెచ్చ,c గృష్ణు
మురళి - ప్రణవార్థ సుస్వరములను బలికె ! 110

అంతరాత్మయై నెవని కృపామృతమున
భవ మహాతాప మెడపి, సత్పదవిc గంటి,
నా జగద్గురు పురుషోత్తమాంఘ్రి కమల
ములకుc బ్రణతులు నిత్యంబు సలుపు వాcడ. 111

హార పద విభూషణుండు, శ్రీహరి యశస్సు
ధా స్వదన సూరి, లీలాశుకాను సారి,
హనుమ పలుకు శ్రీకృష్ణ కర్ణామృతంబు
నందు రెండవ బిందు వానంగ రండు ! 112

శ్రీకృష్ణ కర్ణామృతము ద్వితీయ బిందువు

సమాప్తము.

శ్రీకృష్ణార్పణమస్తు.

ఓమ్

నమో భగవతే వాసుదేవాయ

శ్రీ సాయీనాథాయనమః

# శ్రీకృష్ణ కర్ణామృతము

## తృతీయ బిందువు

సిరికి భోగ్యము, సాత్త్విక సేవనీయ,
మఖిల జగదవనము, రాధికాభిమతము
సుర వినుతము, గోవర్ధ నోద్ధరణ కేళి
లోలమైన, పల్లవ బాల నీల ములరు. 1

సొగసుఁ గులుకులు,ఁ జిఱునవ్వు నెగడు మోము,
ఇంద్రనీల కాంతిని నిరసించు మేను
చక్కదనములఁ గని, రాధ, యక్కజపడు
మురళి బాలు తేజమునకు మ్రొక్కు లిడుదు. 2

నడకలను గజంబుల పెంపు నడఁగఁ జేసి,
యమిత కరుణా రసాకృతి నతిశయించి,
యామునీయవనాంతర మందు మెలఁగు
శ్రుతి హృదయవాసు శ్రీకృష్ణు నాశ్రయింతు. 3

త్రిభువనముల శాశకుఁడయ్యు త్రేమిటారి
వాలుఁగను సన్నలకు వశవర్తి యగుచు,
సరస వర్తన లెల్లెడఁ బఱుప నేర్చు
పరమ పురుషు శ్రీకృష్ణు నేఁ బ్రస్తుతింతు.

రతిపతినిఁ గేరు సొబగు, మేఘతతి వియ్య,
మాల కాపరి చెలుల నెయ్యంబు, తళుకు
సొమ్ము, లధరబింబము, మోముఁ దమ్మి పోలుచు
వల్లవీబాల యౌవనవనముఁ, గొలుతు.

నరుఁడునయ్యు నమానుషాచరణ నెఱపి,
లలిత తనుఁడయ్యు ప్రౌఢలీలలను బఱపి,
బాలుఁ డయ్యును యౌవనపరత నొప్పు,
నాద్యు, ననవద్యు శ్రీకృష్ణు నాత్మఁ దలఁతు.

లోకముల నెల్ల రమ్యముల్ లోభనీయ
వస్తువెల్ల నామది కానఁ బఱపుఁ గాక;
నగు మొగము వేణు నినద సౌందర్య మమరు
నంద పుణ్యంబు రాశి కన్యం బెఱుంగ.

సుకృత సేవ్యమై యమృతంపు సోన లొలుకు
వేణు రవళిచే వీనుల విందు సేయు
వ్రజ కుమారీ ముఖాబ్జ షట్పదము నైన
కృష్ణునందు నా మనసు లయించు టెపుడొ ?

ఆస పెల్లున నా మది యందుఁ జెలఁగు
నమిత మోహాంధకారము నడఁచుఁ గాత !
సచ్చిదానంద కరుణా ప్రసాద యాద
వామృతాంభోధి చంద్ర కటాక్ష కేళి. 9

నిగమ మాళి లాలిత మయి పొగడు వడసి,
గొల్లపల్లె బాటల దుమ్ము పెల్లు దోఁగు
నందనందన పాదార విందములను,
డెంద మందెంతు నవ్య యానంద మొంద. 10

కోమల దరస్మితము మోము గొనబుఁ బెంప,
మాటి కురవడించిన ముని మనము లలర,
శ్వేత లలన దృక్కులఁ బ్రసరించి చొక్క;
మించు, కమలలోచను గృష్ణుఁ గాంచు టెప్పుడో? 11

యౌవన మదంబునను డిగఁద్రావి విడిన
గొల్ల చెలుల యుచ్ఛిష్టమా కువలయదళ
నీలకాంతి పూరంజగు నీదు మేను
గన్నులార నెప్పుడు గ్రోలఁ గలనో? కృష్ణ ! 12

వ్రజ సుదతులు గీర్తించు జవ్వనము హొయలు,
వీనులకు విందుఁ గూరుచు వేణు రవళి,
సకల రమ్య సంపదలకు సారసిద్ధి,
బఱగు కమలలోచను గృష్ణుఁ బ్రస్తుతింతు. 13

చెలువమును బెంపఁజేయు లీలలకు నెలవు,
మూర్తి సంపదలకు నెల్ల మొదలి టెంకి,
నీల నీరద కాంతుల కాలవాల
మైన బాల గోపాలు, నే నాశ్రయింతు. 14

నెట్టుకొని మ్రొక్కు దేవతానీక మాళి
కల్ప సుమమాలికలఁ గంది, గాసినొంది,
ప్రేమఁ గురిపించు శైశవ క్రీడ లమరు
కృష్ణ పాదాంబుజములకే గేలు మోడ్తు. 15

శరజు నెమ్మొందుఁ బురిబూస లరసియాడు,
రుద్రదు వృషభ మెందాల మూర్కొని మదించు,
హరి గజం బేని నడక, లెం దనుకరించు,
నట్టి బృందావనముఁ గృష్ణు నాశ్రయింతు. 16

కెంపు పెదవిఁ జిఱునగవుల్ నింపువాని,
జలధిఁ గికురించు మైచాయ నలరు వాని,
తమ్మి రేకులఁ బోని నేత్రముల వాని,
విపుల కరుణా స్వరూపు గోవిందుఁ దలఁతు. 17

నిగనిగని కాంతి మేనికి సొగసుఁ బెంప,
నెమ్మిపురి దండ వెలలేని సొమ్ము గాఁగ,
గరుణ వర్షించు నిడువాలుఁ గనులు గులుక
నలరు వల్లవ వంశ భాగ్యంబుఁ గొలుతు. 18

పౌర మృగశాబ లోచనల్ వలపు గదుర
నల్ల కలువ కన్నుల వానజల్లు గ్రుమ్మ
రించ, మధుర వీధుల యందు సంచరించు
నందముల గీము, నంబుదశ్యాముఁ, దలఁతు. 19

చక్కదన మొల్కు గడకనుల్ సంచలింపఁ,
జిఱునగవు లీను వెమ్మోము మురిపె మొదవ,
హృద్య గంభీర వచనము లెలమిఁ బఱపు
నందసుతుఁ డౌర! నాదు మనంబుఁ గలఁచె. 20

కఠిన కందర్ప దర్పాశుగముల బంది
నొందు నిందీవరాక్షుల కందు మాన్పి,
మందహాసాస్పద ముఖారవింద మలర్చు
బృంద సుందరీ విటునకు, వందనములు ! 21

బిగువు కౌగిలి సొబగారు వీక్షణములుఁ
బఱపు రాధిక చొక్కఁగ మురళి నొత్తి,
లే నగవు లీను శ్రీకృష్ణు నాననాంబు
జంబునన్ నా మనంబు లీనంబు నొందె. 22

శ్రీశపర వైభవంబయి చెలిమిఁ బఱపి,
శ్రిత తతికి వ్రజ పంజర గతినిఁ బొలిచి,
విపుల కృప నూని గోపాల వేషుఁడైన
కృష్ణుఁడుండ; నన్యుల నపేక్షింప నేల ? 23

నిఖిల జగములకును రమణీయ పదము,
శ్రీరమకు భోగ్యమగా సుకుమార సిద్ధి,
రాధికా కుచాంభోరుహ రాజహంస
కృష్ణుఁ డెపుడు నా మది వసియించుఁ గాత! 24

జగతిఁ బొగడొందు నీ దయాసార మూర్తి
యందు నమిత విశ్వాసముఁ బొందియుంటి,
మైన సొబగారు నీదు బాల్యాకృతి కయి
ముక్కు వెక్కుడు గనెడి నా మనసు, కృష్ణ! 25

వత్స భాగ్యంబు నందు శ్రీవత్స మూని,
వత్స పాలురతో నాడ నుత్సహించు,
సత్సుధామయ మూర్తియగా వత్స కృష్ణు,
మత్సుకృతిఁ, జూచు టెపుడొ? నేత్రోత్సవముగ, 26

రామణీయకము మనోభిరామ మగుచు
మందహాసాంకిత ముఖారవింద మమర,
నిఖిల జగములకును లోభ నీయుఁడైన
వ్రజ విహారికై, చిత్తము పరువు లెత్తు. 27

అలకాపు చెల్వాల నిడు వాలుచూపు
తుమ్మెదలు దొమ్మి రేగు తానమ్ము; తెనె
సోన లొలికించు నీ మురళీ నినాద
పూరమగా మోముఁ గనఁ గృష్ణ! మోము వాచె! 28

వెడదఁ కనుల కాంతులఁ గ్రోలి, వ్రేతలెల్ల
వేణుగాన నర్తనముల వివశ మొంద,
నొసటఁ జెమట బిందులు మందహాసన మొప్ప
నడుగు.దమ్ము లొయ్యన నిడు బుడుత,ఁ గొల్తుతు. 29

ప్రకృతి సుకుమార బాల్య సంపదలు పొదల,
ప్రియులు పజ్జలఁ గడకంటి హాయలు పఱుప,
ముద్దుమోము మేనికిఁ గ్రొత్త మురువుఁ గూర్చు
పింఛ చూడుని, ధూర్త గోవిందు,ఁ దలఁతు. 30

పెదవు లింపుగఁ ద్రిప్పుచు వేణు వూది,
మోము దమ్మి శోభిల,! గాంతి పుంజమైన
బాలు వెదకుఁడీ! వృథ సేయనేల కాల
మీరలో! వన దేవతలార! యింక. 31

పరుల కందని కాంతి సుందరము, గోప
పతుల కనుదమ్ములకు నివాస స్థలంబు
నౌ పురాణ పూరుష కృష్ణరూప నవ వి
లాసములఁ జూతు,ఁ బుణ్యబలంబు కలిమి. 32

సకల దేవతలకు, నిదె; సాగిలఁ బడి
యెల్లగతుల నీ మాత్ర యాచించు వాఁడ;
సుందర దరస్మిత ముఖారవింద మలరు
నందసుతు నందు భక్తి పెంపొందుఁ గాత! 33

ఏటివలె నాగకే ప్రవహించు నరుని
కాలమున, నీల వర్ణుఁడౌ బాలకృష్ణు
చరిత సుధఁ బ్రీతిఁ గ్రోలెడి క్షణ మొకండె
సార్థకం, బన్యకాల మెంతైన నేమి ? 34

మురిపె మిడు మోవి, కరుణను గురియు కనులుఁ,
జిఱునగవు లీను మోము దానురయు నలరు
రసిక సేవ్యము, పల్లవీ ప్రాణమైన;
భువన లోభనీయునిఁ గృష్ణు, బ్రమొక్కువాఁడ. 35

అజిత మోహాంధకార సమావృతమగు
నిట్టి నా నుదియం దుదయించుఁ గాత!
అంబుజాక్షుఁడౌ శ్రీకృష్ణుఁ డతని వెంటఁ
బరువు లెత్తుడు గోపికా పాద రజము. 36

గొల్ల చెలులు గుబ్బల నలుగుడులు గనిన
మేను సొబగారు బాలుఁడు, మెల్ల మెల్ల
మురళి నూఁదుచు నా మ్రోల పొడముఁ గాత!
కరుణ గురిపించుచుఁ బ్రయాణ కాలమందు. 37

ఆత్మ సేవింతుఁ బలుకుల నలవి గాక
గొల్ల పడుచుల చను ములుకుల వసించు
సాటి గనఁబోని చిత్త రసాయనంబుఁ,
బరమ మధురా ద్వయంబైనన బాలకృష్ణు. 38

భువనముల నెల్ల దీపించు, భూషణంబు,
నఖిల గోపికా జన నయనామృతంబు
నైన శ్రీకృష్ణుఁ డీ యింద్రియములఁ జిక్కఁ
బడునె? మఱుమేన నేని, నపార కృపను. 39

నిగమమౌళి వాక్యంబులఁ బొగడు వడసి,
నిఖిల మునివర సంస్తవనీయుఁ డయ్యు;
వల్లవీ నితంబ స్తన భార వీక్ష
ణామితోత్సాహియౌ ఘనశ్యాముఁ దలఁతు. 40

శ్యామ సుందరు సౌందర్య సంపదలఁ జ
లించ నీక చిత్తమున సేవించి, 'కృష్ణ!
దేవ! దయితా!" యటంచుఁ గీర్తించు మేము
పడయఁ గలమె తదీయుల భాగ్య గతులు? 41

బృంద సుందరీ నయనార విందములకు
విందుఁ గూరుచు నానంద కందు, నంద
నాయకీ సమార్జిత కీర్తి తోయరాశి
నీల శీతాంశు, నీక్షించు వేళ, యెపుడొ? 42

కులుకు బెళుకుల జిగి సంపదలకు నెలవు,
బ్రిత నితాంతాపరాధ నిస్మృతికిఁ దావు,
సుకృత జన మానస ప్రణతికినిఁ బాత్ర
మాత్మవిద పదమా బాలు నాశ్రయింతు. 43

మించి యమృత సేవను నిరసించఁ జాలు
సొగసు చిఱునగవుల హొయల్ చూపనేర్చి,
వెన్నెలంతల కనులకు విందు సేయు
శ్రీశు తేజము, మమ్ము రంజించుఁ గాత! 44

పలు గతులఁ జిఱునగవులు మొలకలెత్తఁ,
గనుల నమృతంపు సోనలఁ దనిపి, గొల్ల
గుబ్బెతల గబ్బి గుబ్బల కబ్బురంపు
సంబరముఁ గూర్చు కృష్ణు తేజంబుఁ గొలుతు. 45

గైరికరస కలిత ఘనసార లిప్తమై
తొగరు గనియు, గొల్ల తొయ్యలుల లకు
చాగ్ర కుంకుమమున నతిరమ్యమౌ, కృష్ణు
నురమ్ముఁ గొలువ రండు! సరసులార! 46

తనువు నిలువెల్ల లీల లెంతయును బఱపి,
భువనములఁ గడగంటి చూపులను దనిపి,
యిందువదనుఁడు వ్రజబాల సుందరుఁ డగు
కృష్ణు మాధుర్య రక్షించు మమ్ము! 47

అమల సరసున మెలఁగు రాయంచ కలిమి
మొఱయు తామర యన, వ్రజమునఁ జరించు
నలఘుమణి నూపుర నినాద కలితమైన
కృష్ణ పాదాంబుజం, బాశ్రయించు వాఁడ. 48

దిక్కు లేకున్న వారల దిక్కు నగుచు
శ్యామ సుందరమూర్తియై, కామ వివశ
చిత్తులగు గోపికాంగనల్ చేరి మ్రొక్కఁ,
బొలుచు, వాసుదేవ బ్రహ్మ, ప్రోచు మమ్ము. 49

పరిమళాంచిత కాంతి సంభరిత తనువు
నందు యౌవన బాల్యముల్ పొందు పొసఁగ;
ప్రకృతి సుందర ముఖిలేశ వైభవంబుఁ
దనరు గోపాల బాలుఁడు మనుచు మమ్ము. 50

వలపుమై మింట సుర సతుల్ నిలచి సొగసు
జూపులన్ బాల్యపున్ సొంపుఁ జూచి చొక్క,
ననుగమించు గోపికల నొయ్యారముగను
గనెడు భువన మోహనమూర్తి, కాచు మమ్ము! 51

మహిత సంసక్తి నాపాదమస్త మెవని
సుందరాకృతి మునులెంచు చుందు; రెవని
రూప సారస్య మెఱిఁగిరి గోప సతులు
నట్టి నందుని పట్టి, చేపట్టు మమ్ము. 52

విరహ వేదనఁ గలఁగు గోపికలఁ బ్రియము
నెఱపఁ గడగంటి చూపుల వరుసఁ బఱపి,
గగురు పడ నొడల్, వారి చెంగటన పొడము
శ్యామ సుందరుఁ డొసగు, మా కామితముల. 53

శివ భవుని నెమ్మి పింఛము సిగను జొనిపి,
మేరు గైరిక గంధంబు మేన నలఁది,
సుర సతులు పూల సోనలు గురియ, మురువు
సూపి వర్ధిల్లు మా శ్యామ సుందరుండు. 54

మురిపెమును బెంచు చిఱునవ్వు మోవి కూర్పఁ,
గులుకు వలరేని దుడుకుల నులికి కనులు
గొల్ల పూఁబోండ్ల పాలిండ్లఁ గొల్ల గొనఁగఁ,
బొలుచు కృష్ణు ముఖాంబుజం బలరుఁ గాత! 55

మదన కదనంబులను స్వేద మొదవ, సొగసు
చిఱునగవుల నీనెడు మోవి యరుణ రుచులఁ
బఱపి, వ్రేతల కోర్కె లేమఱక తీర్చు
కృష్ణు ముఖసారసంబు వర్ధిల్లుఁ గాత! 56

రాధ కడకంటి చూపులఁ గ్రోలి, యెడఁద
నలసి నిద్రించు నిందిర యులికి కౌగి
లించుకొనఁ జిక్కనై, పరితృప్తిఁ గూర్చు,
కృష్ణు పులకాంకురములు వర్ధిల్లు గాత! 57

చిర ముపాస్యంబులన కృష్ణు చిఱునగవులుఁ
బురియు, వెడఁద కన్నుల సొంపు, మోముదమ్మి,
మురళి రవళి, వ్రేజవరాండ్ర విరహ చరిత
ములగు నా చిత్తసంస్కారములకు, జయము! 58

కంతుఁ డెద్దాని లవ కణికా ప్రమాణ
సిద్ధిచే, జగన్మోహన స్థితినిఁ బడసె,
నట్టి సహజమా బర్హిబర్హా వతంస
కృష్ణ సరస కాంతి సుధా సమృద్ధి వరలు! 59

వెన్నెలను గేరు చిఱునవ్వు, వెడఁద కనులు,
చపల గతిఁ బొల్చు యవ్వనసార మమరి,
రసిక సేవ్యమై, వల్లవీప్రౌఢ కుచ భ
రాశ్రయముఁ బొందు శ్రీకృష్ణుఁ డలరుఁ గాత! 60

గొల్లపల్లె పాళెము, భటుల్ గొల్లవాండ్రు,
సతులు గొల్ల చెల్వలు, గిరి చందనంబు
పురులె బూసలు, శివ! శివా! ముజ్జగముల
కీశ్వరుఁడ వందు రార్యు, లిదేమి? కృష్ణ! 61

నెమిలి పురిబూన, లింపులు నింపు మేను,
లచ్చి మది మెచ్చు హొయలు విదగ్ధ్చయముల
కాశ్రయంబును, వల్లవీ ప్రాణమైన
కృష్ణు, నౌర! యెవ్వారు కాంక్షింపఁ బోరు? 62

బెదరు కన్నులు నెఱనౌ పెదవి పొదల,
నిబ్బరంబగుసంతసం. బబ్బురంపు
కాంతిసుధలీను చిఱునవ్వు గ్రాలు, బాల
కృష్ణు నఱచొక్కు మోము, స్మరింతు సతము. 63

లెమ్ము! మేల్కొమ్ము! పండెఁ బున్నెమ్ము, పెద్ద
కాలమునకుఁ, గృతార్థతఁ గంటి, మనమ!
పూర్ణ నిర్వాణ మిదె! నీదు ప్రేమోలఁ బొడమెఁ
గృష్ణుఁడై; వైశము సమాశ్రయింపఁ గదవె! 64

అరుణ పదములు ప్రేలు పెన్నెరులు వరలఁ,
గృపను వర్షించు నేత్రముల్, విపుల యురము,
నీల నీరద కాయము నీటు గులుకు
వ్రజ విహారి తేజము, మధురం బిదార! 65

తలను పింఛము, వనమాలికలను దాల్చి,
నొసట వింత కస్తురిబొట్టు పొసఁగ దిద్ది,
శ్రావ్య మురళీ రవామృత రసికుఁడైన
శ్యామ సుందరుఁ, బరదేవు, నాశ్రయింతు. 66

మృదు పదంబులు, పెన్నెరుల్ బెదరు కనులు,
నిడుదలైన కరంబులు, వెడద యురము,
సొగసు లొలుకు మోవియు, నవ్వు మొగముఁ దనరు
వన్య వేషియౌ కృష్ణ శోభన లివేమి ! 67

జవ్వనము తోన సొగసులు నివ్వటిల్ల,
వేణు నిన దామృతముఁ గురిపించి మించి,
బృంద కాంతాననాంబుజేం దిందిర మగు
నంద సర్వస్వమున కివే వందనములు ! 68

వాలు బెళుకుఁ గన్నులు, మబ్బుఁ బోలు మేను,
నెమ్మి పురి సొమ్ము, మోము చెల్వమ్ముఁ గలిగి
కొలుచు మాత్ర విశ్రమ మెదఁ గూర్చు వయసు
నీటు లొలుకు పెన్వేల్పున కేటి కోర్లు! 69

మోము గాదిది–సరస సంపూర్తి గాని;
స్మితము గాదు–మధుర చతురతయె గాని;
చూపు గాదిది–కృపకుఁ బెన్ప్రాపు గాని;
శిశువు గాదిది–నయనార్థ సిద్ధి గాని. 70

ఎట్టి పున్నెంపు కలిమినో, యెం దొకందు
వాసుదేవ! నీ పయి దృఢభక్తి గదురు
నేని, మోక్షంబుఁ దాన లభించు ననిన,
నితర పురుషార్థముల మాట. లెంచనేల? 71

కామ పరవశ గోపికా కాంక్షితముల,
సిద్ధ యోగీంద్ర భృంగ సంసేవితముల,
సచ్చిదానంద భాగ్య ప్రసాదకములఁ,
గృష్ణ పాదాంబుజముల మ్రొక్కెద సతంబు. 72

కపట మెఱుఁగని పల్లవాంగనలు పలుకు
పలుకు కెల్ల వీనులకు విందులుగ, హృదయ
రంజకంబులు గాఁగ, గారవము సేయు
వన్నెకాఁడగు శ్రీకృష్ణుఁ బ్రస్తుతింతు. 73

సోలపుఁ గడగంటి చూపులు, సొగసు మొగము,
కరమునం దింపు లొలికించు మురళి నూని,
కొమరు ప్రాయంపు సొబగులు గురియు, కృష్ణ
పరమ కరుణా లహరి మది, వరలుఁ గాఁత ! 74

కదుపులను మేపు నేరుపుఁ గొదమ వయసు,
నెమ్మిపురి బూస, మోదమ్ము నింపు మురళి,
వెడఁద కనులు, దైవారగ వ్రేలఁ దనువు
జీవగఱ్ఱ, కృష్ణుండు రక్షించు నన్ను. 75

చిఱునగవు జొంపములు మోవిఁ జిందులాడ,
బెళుకు నిడు వాలుఁ గన్నులు గులుక, మురళి
రవళి శీతల సుధలీన నవని డిగిన
భువన విభుఁడు శ్రీవత్సుండు ప్రోచు మమ్ము. 76

ఆశ్రయింతు గోర్కెలిడు నేత్రాంబుజంబుఁ,
బరమ కృపఁ గురిపించు హృత్సరసిజంబు,
వల్లవీ విభవానన వనరుహంబు,
ముని నిధానమా హరి పదాంభోరుహంబు. 77

ఇతరముల విరసంబుఁ గావించు మాధు
రీ నిధానమై, తనయంతఁ బ్రేమ నెఱప
మహికి డిగ్గిన మోక్ష సామ్రాజ్యమైన
గోపికాభీష్టదైవంబు, ప్రాపు మాకు. 78

మురళి విని మరులెచ్చి శ్రేతరుణు లెలమిఁ
గఱకు గుబ్బల నొక్కుచుఁ గౌగలింప,
లీలఁ వారలఁ గూడి కాళించి తటిని
నిసుక తిన్నెలఁ తిరుగాడు కృష్ణుఁడోము! 79

సరస వేణు గీతులు సుర సతులు గార
వించ, బృదావనంబున సంచరించి,
నీల నీరద నిచయంబుఁ గేలిసేయు
శ్యామ కాంతి-వెల్గొందు నాస్వాంతమందు. 80

సూన బాణముల్ వడిఁబంచ బాణుఁడేయ,
శ్రోణి భరమున నల్లన నేణి నయన
లైన వ్రేజాణ లొగిఁ జుట్టి వ్రేణిఁదీర్చ,
వాణి కందని వ్రజజన త్రాణుఁ,గొలుతు. 81

మురళి డాకేల, మొల ప్రక్క బూరగొమ్ము
నునిచి, పలు మరుల్ క్రేపులఁ గనుచు, యమునఁ
దాకు తిన్నెలఁ గూర్చుండి, తామరాకు
లందుఁ జలుదులు దిను కృష్ణు, నాశ్రయింతు. 82

వ్రే రమణుల మోమునను గస్తూరి బొట్టు;
కమల కుచ కుంభముల నల్ల కలువ పూవు,
అవ్యయ నిధాన మూల సిద్ధాంజనంబు,
శ్యామమూర్తి, వెల్గొందు నాస్వాంత మందు. 83

వేణునాద వినోదునిఁ, బీత వసను,
నిందు వదను, నిందీవర సుందరాంగుఁ,
బింఛ చూడు గో గోపికా వృతుని, వ్రజ వి
హారి, శ్రీవత్స కౌస్తుభ ధారిఁ గొలుతు. 84

ఎవని బొడ్డు దమ్మిని బ్రహ్మ భృంగమయ్యె,
చక్షులిన చంద్రు, లురము శ్రీసదన మయ్యెఁ,
జరణ జలము శంకర జటా భరణమయ్యె,
స్మరణ మఘహర మయ్యె, నా హరినిఁ దలఁతు. 85

హరి పదములఁ గల్వాలు, నాభి సరసి మీలు,
మది మరు శరాలు, మెడ నింద్రమణి సరాలు,
మొగమునను దుమ్మెదల చాలు, సిగను బురుల
డాలు, నా వేళ్ల వాల్చూపు లేలు నన్ను. 86

పెరుఁగుఁ జిలుకుట విని లేచి, వేకులను
నెఱుకఁబడకుండ వ్రేతల యిండ్లఁ జొచ్చి,
వెలుగు దివ్వె లారఁగ నూఁది, పెరుగు వెన్న
లెలమి మ్రింగు గోపకబాలుఁ డేలు మమ్ము. 87

తలఁతు వేకట, దధి రవోద్గళిత నిద్రు,
నిద్ర ముద్రాంకిత స్మితభద్ర వదను,
నంబువాహక శ్యాము, నేత్రాభిరాము,
శీత నవనీతు, వికచాంబు జాత నేత్రు. 88

ఫుల్ల హల్లకములఁ బూని కర్ణములఁ, జె
క్కిళ్లు మెఱయ, శ్రుతుల కెల్ల మీఱి,
వల్లవీ శిరోజ పరిమళ తాంగుళీ
పల్లవుఁడగు, నల్లగొల్లఁ దలఁతు. 89

వివిధ చౌర్యాఘముల మాన్పు వెన్నదొంగ,
గురు సతినిఁ గూడు నఘమాఁచు గొల్ల విటుని,
బ్రహ్మ హత్యాఘములఁ బాపు రావణారి,
త్రాగుడఘ మేర్చు పూతనాంతకునిఁ దలంతు. 90

కృష్ణ సదనంబు మదన! నా హృదయ, మిచట
నిచ్చ వచ్చినట్టులఁ జరియింపఁ జనునె,
అవియె! కమలాలయా కాంతు, డరుగు దెంచె
నేగు; మొరులింటఁ జొరఁబడు టెవ్వఁ డోర్చు? 91

ఎడమ చేయి మోకాలిను ముడిచి కొనుచు
భూమిపై మోపి, కాయము బోరగిలఁగ
వంచి కుడిచేతి వెన్న వీక్షించు చుండు
బాల గోపాలుఁ గరుణాల వాలుఁ దలఁతు, 92

వడిని మోకాళ్లఁ జేతులఁ బరుగు లిడుచుఁ,
గుండలంబులు సొగసు ముంగురులుఁ గులుకు
నందకాఁడు, నా కన్నుల విందు నైన,
బాలగోపాలు, వేకువ వేళఁ గొలుతు. 93

విల్లు బాణముల్ క్షణమాత్ర విడచి వైచి
మురువు లొలికెడి మురళినిఁ గరము నందుఁ
దలను బింఛవు దండల నిలువు దేని,
జనకజా మనోహర ! నీకుఁ బ్రణతి సేతు. 94

పాలవెల్లికి దొర, వాల పాలుఁడ వని
పాలకై యూసలొందె, నీ పాలఁ బడితిఁ;
బాల మూటేల? తుదిఁ దల్లిపాలుఁ గూడ
లీల హరియింతు, వౌర! గోపాల బాల! 95

"చేతి నెగఁద్రోసి పోవు టచ్చెరువె? నాదు
హృదయ మందుండి వెలుపలి కేగు దేనిఁ
దెలియు నీ మగతనపుఁ బందెములు కృష్ణ!"
యనెడి, శ్వేత నేరుపు మెచ్చు హరిఁ దలంతు. 96

తమముఁ గెడప భానుఁడు, సముద్రమున మునుఁగు
ప్రాణికినిఁ దెప్ప, తృషితున కమృత వృష్టి,
పేదకు న్నిధి, రోగికి వెజ్జు నటుల,
భవ భయముఁ బాపి మమ్ము గోపాలుఁడోము! 97

శంఖ చక్ర పాశాంకుశ స్వర్ణ వేణు
వులను, జెఱకు విల్ సుమ శరములను బూని,
స్మిత ముఖుండును గోపికా వృతుఁడు నైన
భక్తజన లోలు, మదన గోపాలుఁ దలఁతు. 98

బృంద నీసుక తిన్నెల నిండు వెన్నెలందు
భువన మోహనుఁడై రసస్ఫూర్తి నెఱపి,
రసికమయి గోపికలఁ గూడి రాసకేళి
సలుపు గోపాల కృష్ణు సంధ్యల మతింతు. 99

బృందవన మందునఁ గదంబ వృక్ష నీడ
స్మిత ముఖుండుఁ బద్మాసనాసీనుఁ డగుచు,
గోప గో గోపికలుఁ బ్రేమఁ గూడి మ్రొక్క,
వేణు గానము సేయు గోవిందుఁ గొలుతు. 100

మొలను బదములఁ జిఱు గజ్జియలు ధ్వనింప,
తొడను దుప్పి గోరును, నల్లమేను మెఱయ,
నసురుల నడంచి సురల సమాదరించు
నబ్జముఖుఁ గృష్ణు, నుతయమం దభినుతింతు. 101

అమర వందితు, సిత దరహాస కలితు,
గోప గో గోపికావృతుఁ, గ్రూరహంతు,
బర్హ మకుట సంశోభితు, భానుమంతు,
బుధ విహితుఁ గృష్ణు, మధ్యాహ్నమున నుతింతు. 102

వర సుదర్శన ధారి, భూభార హారి,
నజ సురాద్యుపకారి, భక్తానుసారి,
సత్త్వ సంచారి, మోక్ష ప్రసాదకారి
శౌరి మాపునఁ గృష్ణ విహారి కొలుచు. 103

చెఱకుగడ విల్లు, పుష్పంపు శరము, శంఖ
చక్ర పాశాంకుశమ్ములు, వంశంబు నష్ట
కరములం దాల్చి, సూర్యప్రకాశ మలరు
భక్త పరిపాలు, మదన గోపాలుఁ గొలుతు. 104

భ్రమసి చంద్రావళినిఁ గని "రాధ! శుభమె!"
యనిన, "కంస! క్షేమమె? నీ" కటన్నఁ "గంసుఁ
డెవఁడె?" నాన్, "రాధ యెవ?"రని, యువిద పలుక,
సిగ్గుపడి నవ్వు శౌరి, రక్షించు మమ్ము. 105

"తలుపు దట్టు వారెవరు?–మాధవుఁడ,–నేన్; వ
సంతుఁడవా?–చక్రిఁ; గుమ్మరా? క్ష్మాధరుండ;
ఫణి పతివా?–సర్ప మర్దినిన్:–బతగ పతివా?
హారినిఁ:–కపివా?" నాన్, సతి మెచ్చు వశదుఁ గొలుతు. 106

వజ్ర నిశిత ధారల మహా పర్వతములు
వేల కొలఁది ఖండంబులై కూలునట్లు,
కృష్ణ! నీ నామ మెపుడు స్మరించు వారి
పాప సంచయములు పటాపంచ లగును. 107

కరుణ దొలుకాడు వెడదలా కన్నుఁ గవయు
నూపు రనిన దాను గుణ వేణూ స్వనంబు
వెలయు నీ విభవంబుఁ జూపింపు, మెందు
నెందు నా కనుల్ మెలఁగు, నందందుఁ గృష్ణ! 108

విదురు సేవ, భరద్వాజు విందు, గొంతి
ప్రియము, శబరి ఫలము, విప్రు పృథుకములు, వ
గార్చనము, తల్లిపాలు, రాధాఽధరంబుఁ,
బ్రీతిఁ గొనినట్లు, కృష్ణ! నా కైతఁ గొనవె! 109

సరస మతులకుఁ గర్ణ రసాయనంబు
వ్రజ పురంధ్రులకును జిత్త రంజనంబు,
పలుకుబడికి మహాభాగ్య భాజనంబు,
అమృత ఘంబు, శ్రీకృష్ణ కర్ణామృతంబు! 110

హారపత విభూషణుండు శ్రీహరి యశస్సు
ధావ్రతణ సూరి లీలా శుకానుసారి
హానుము పలుకు శ్రీకృష్ణ కర్ణామృతంబు
నందు మూఁడవ బిందువు నాన రందు! 111

శ్రీకృష్ణ కర్ణామృతము తృతీయ బిందువు

సమాప్తము.

## వినతి

భక్త లీలాశుకుఁడు సురభాషఁ బలుక
నాంధ్ర గీతము లందు నీ హానుమ కూర్చెఁ
దెలిసినంత; నీ కృతిని వర్ధిల్లఁ జేసి
కొమ్ము, కృపను, గల్ప శతాంత రమ్ము, కృష్ణ! 112

సరస వచన భాగ్యం బభ్యసనము సలుపు
ధన్య కర్ణపుటము లమృతమున నింపు,
వశ్య సుదృశ హృన్నయన దీపకు సమగ్ర
హంబ యగును, శ్రీకృష్ణ కర్ణామృతంబు. 113

పుణ్య గీతంబు భక్తి ప్రబోధకంబు,
ఆర్త భక్త జనైక జీవామృతంబు,
అమృతదంబు, శ్రీకృష్ణ కర్ణామృతంబుఁ,
దగఁ బఠించు భక్తులకు వందన శతంబు!! 114

---

శ్రీకృష్ణ కర్ణామృతము సర్వము సమాప్తము

శ్రీకృష్ణార్పణ మస్తు

ఓం తత్ సత్.

ఓమ్

నమో భగవతే వాసుదేవాయ

# శ్రీకృష్ణసందేశము

యథోర్ణనాభి స్సృజతే గృహ్ణతే చ
యథా పృథివ్యామోషధయ స్సంభవంతి,
యథా సతః పురుషాత్కేశలోమాని
తథాక్షరా త్సంభవతీహ విశ్వమ్.

ఎట్లు సాలెపురుగు నూలును సృజించి మరల గ్రహించుకొనుచున్నదో, ఎట్లు భూమియందు ఓషధులు పుట్టుచున్నవో, ఎట్లు జీవితుడైన పురుషుని శరీరమునందు కేశములు రోమములు జనించుచున్నవో అట్లు అక్షర బ్రహ్మమునుండి యీ ప్రపంచము కలుగుచున్నది.

(ముండకోపనిషత్తు ౧-౭)

*    *    *

విశ్వసృజనకర్త – ఈ దృశ్య ప్రపంచ నిర్మాణమునకు ఆధారమైన వస్తువు - శక్తి, నిరంతర మెడబాటులేని "పురుషుడు, ప్రకృతి" అని, యెఱుఁగనగును. ఈ ద్వయమేకమే కాని భిన్నములు కావు.

పై శ్రుతి వాక్యము ననుసరించి, సాలెపురుగు అల్లుట ప్రారంభించు పూర్వము దాని యుదరమందొకవిధమగు జిగటపదార్థముఁ గలిగియున్నది. దాని యుదరమందున్న జిగట పదార్థమును సాలెపురుగునకంటె భిన్నమని చెప్పఁజాలము. కావున పురుషుఁడు సాలెపురుగువంటివాఁడు. ప్రకృతి – ఆ

సాలెపురుగునందుగల జిగట పదార్థము వంటిది. ఆ రెండునేకమే. ఆగూడు నల్లుట దాని స్వతస్సిద్ధమైన శక్తియైయున్నది. కావున ఆ జిగట పదార్థము అల్లికల నల్లుశక్తి, ఆ సాలెపురుగు నందంతర్భాగమైయున్నది. కావున ప్రకృతి, పురుష నందంతర్భాగమేకాని; భిన్నముకాదు. ఆ రెంటిభేదము నిరూపించుటకు - విడదీయుటకు సాధ్యముకాదు.

ఆ సాలెపురుగునందుఁగల జిగటపదార్థము, అల్లికలనల్లుశక్తి-ప్రకృతి యొక్క ద్వివిధరూపములగుటచే ప్రకృతి-ద్వితయము. కావున నది "ఉపాదానకారణము" (వస్తువు) "పరిణామ కారణము" (దృశ్యము లేక వ్యక్తమగుట) నైయున్నది. ఈ ద్వివిధశక్తులు లీనమై కార్యాచరణమున కుపక్రమించు పూర్వము ఈ ప్రకృతిని - "మాయ" - అని పిలుతురు. ఇవి (ఈ ద్వివిధశక్తులు) క్రియాభిముఖములు కాగా సాలెపురుగునుండె సన్నని నూలు వెలువడును. అటుల ప్రకృతి కొకవిధమగు చైతన్యము కలుగును. అట్టి స్థితిని "అవిద్య" యని యందురు. ఆ అవిద్యయొక్క పరిణామమే మనము చూచుచు, స్పృశింపఁగల "పోగు"-మన యందఱలోఁగూడిన యీ దృశ్య ప్రపంచము, కావున పురుష నందంతర్భూతమైన "మూలప్రకృతికి" ఈ మాయ-అవిద్య అను ద్వివిధక్రియాత్మక నామములు కలిగినవి ఈ "పురుష ప్రకృతి" యొక్క సంపుటియే "బ్రహ్మము" - అను ఏకైక నామమున నిర్దేశింపఁబడుచున్నది.

ఈ ప్రకృతియొక్క స్వతస్సిద్ధ స్వభావము "గుణము" అని పలుకఁబడును. ఇది త్రివిధములు. సత్త్వగుణము- రజోగుణము- తమోగుణము- నిశ్చలిన ప్రశాంత్త స్థితిని సత్త్వగుణ మందురు. చైతన్యవంతమైన స్పందించు శక్తిని రజోగుణమందురు. జడమై స్తబ్ధమైన స్థితిని తమోగుణమందురు. ఈ త్రిగుణములు అవినాభావ సంబంధముగలవై నిర్వ్యయపరాకయుండును.

ఒకగుణము ఉత్కృష్ట స్థితియందున్న తక్కినవి రెండును లీనమైయుండును. కాని నశించిపోరాదు. సత్త్వగుణ ప్రధానమైయుండు ప్రకృతి, "మాయ" అనఁబడును. రజోగుణము ప్రధానమైయున్న నది (ప్రకృతి) "అవిద్య" యనఁబడును. సత్త్వగుణ ప్రధానమైయున్న కారణమున మాయను నిర్మలము పరిశుద్ధమైన అద్దమునకుఁ బోల్పనగును. రజోగుణ ప్రధానమైన ప్రకృతిని మట్టిచే నావరింపఁబడిన అద్దమునకును, తమోగుణ ప్రధానమైన ప్రకృతిని మరకలతోఁగూడిన అద్దమునకు బోల్పనగును. మాయాస్థితియందు ఆమూల ప్రకృతి - అద్దము ప్రకాశవంతమైయుండును. అవిద్యాస్థితిలో మలినభరితమైయుండును.

పురుష ప్రకృతుల సంపుటి బ్రహ్మమని చెప్పబడుటచే పురుషుడు బ్రహ్మమైన - ప్రకృతియు బ్రహ్మమే. కావున "మాయ" సత్త్వగుణ సమావృతమైన "బ్రహ్మము" - అగుచున్నది. అపుడు "అవిద్య" రజస్తమోగుణావృతమైన బ్రహ్మమగును. రజోగుణమును మాళిచే నావరింపఁబడినను, తమోగుణమును మరకలతోఁగూడినను (అద్దము). మాయా శబలిత అవిద్యయు బ్రహ్మమే యగుచున్నది. కావున వానిని - మాయా బ్రహ్మము: అవిద్యాబ్రహ్మమను పేరులఁ బిలుచుచము. ఈవిధముగఁ బ్రతిపాదించి స్మృతియందుంచుకొని ఈ మాయ - అవిద్యలను బ్రహ్మముతో ఐక్యము ధృవపఱచు కొందము.

మాయా బ్రహ్మమునకు ఈశ్వరుఁడు సర్వజ్ఞుఁడు - సర్వేశ్వరుఁడు అను నామాంతరములు కలవు. దేవ మనుష్య తిర్యక్కులందు (మానవాతీతులు - మానవులు పశుపక్ష్యాదులందు) గల అవిద్యా బ్రహ్మమునకు "జీవుఁడు" అను నామాంతరముగలదు, ఇట్లు జీవుఁడు, ఈశ్వరుఁడు - మూలప్రకృతి, పురుషుఁడు అందఱు "బ్రహ్మమే" భేదము - అసత్త్వరజ

స్తమోగుణారోపితములగు పవిత్రతత - అపవిత్రతతల తారతమ్యులే. మాయ
బ్రహ్మము లేక ఈశ్వరుఁడు (సృష్టికి ప్రధాన కారణము) "కారణ ఉపాధి"
అని పిలువబడుచున్నాడు. అవిద్యా బ్రహ్మము - జీవుడు సృష్టిపర్య
సానము, కార్యవుపాధి. అనియు నెరుగదగును. ఆ జీవుడు తాను ప్రవేశించు
ఉపాధుల (పోతల) వలన నానాత్వము-వివిధరూపముల ధరించుచున్నాడు.
"డార్విన్" యొక్క పరిణామ సిద్ధాంతమువలెగాక, పరస్పరాశ్రయము లే
వెర్వేరగు ఎనుబదినాల్గు లక్షలు సృష్టిజాతి భేదములు కలవు. సత్వగుణ
ప్రధానములగు జీవులు, ఇంద్ర - వరుణ - అగ్ని యమాదులుగఁ బేర్కొన
బడుచున్నారు. రజోగుణ ప్రధానముగాగల జీవులు మనుష్యులుగ, తమో
గుణ ప్రధానముగ గలవి పశుపక్ష్యాదులుగ పేర్కొనబడుచున్నవి.

ఈ 84 లక్షల యోనులు - ఉపాధులు ఆకృతులు అవిద్యయొక్క
రూపములే. ప్రతి రూపమునందంతర్గతములైన రెండు కోశములు గలవు
అన్నిటి లోపలగల కోశము "మాయ" సత్వగుణ ప్రకృతి - "కారణ
శరీరము" అను ప్రత్యేక నామము కలది. కారణశరీరము నావరించి
"సూక్ష్మశరీరము". ఆ సూక్ష్మశరీరమును గప్పి స్థూలశరీరము - మనకు
గనబడు శరీరము కలదు; మాయయొక్క సాత్విక ఉపాధి, కారణశరీరము.

అయిదు జ్ఞానేంద్రియములు - త్వక్కు (చర్మము) చక్షుస్సు
(నేత్రము) శ్రోత్ర (చెవి) జిహ్వా (నాలుక) ఘ్రాణము (ముక్కు) ఐదు
కర్మేంద్రియములు వాక్కు (మాట) పాణి (చేయి) పాద (కాలు) పాయువు
(గుదము) ఉపస్థము (జననేంద్రియము) ఐదు ప్రాణములు. ప్రాణ, అపాన
వ్యాన, ఉదాన, సమానములు, ఇవి పదునైదు. మనస్సు బుద్ధి యీ రెంటితో
పదునేడు తత్త్వములు సూక్ష్మశరీరము లేక రాజసిక అవిద్య అగుచున్నది.

కారణశరీరముచే నావరింపబడిన మాయా - బ్రహ్మము "ప్రజ్ఞ" అని పిలువబడుచున్నాడు. ప్రజ్ఞ మరలా సూక్ష్మశరీరముచే నావరింపబడి "తైజసుడు" అనుపేర బఱగుచున్నాడు. ఈ స్థితియందు జీవుడు సూక్ష్మ శరీర వ్యాపారముల తనయందారోపించుకొని తాను బ్రహ్మమను విషయము మరచుచున్నాడు. సూక్ష్మశరీరము నందలి "రాజసిక అవిద్య" అను దట్టమైన పొర ఈ విస్మృతికి - జీవిదృష్టి భేదమునకు కారణమైయున్నది. భ్రాంతిమూలమున "ప్రజ్ఞ" కారణ శరీరమును తన ఆత్మ యని భావించుచుండ, ఆ భ్రాంతి మూలముననే "తైజసుడు" సూక్ష్మశరీరమును తన ఆత్మగా భావించుచుండును. నేను వినుచున్నాను. నేను పలుకుచున్నాను. నే నాకలినొందియున్నాను. నేను ఆలోచించుచున్నాను. నేను నిశ్చయించుచున్నాను... అని ఉూ పదునేడు తత్త్వముల వ్యాపారములు తనవిగా భావించును.

ఇచట నొక విషయము జ్ఞప్తియందుంచ కొనదగును. 'సమిష్టిజీవి - యని వ్యవహరింపఁబడు అవిద్యా బ్రహ్మమునందుఁ గలుగు భ్రాంతికి పలు విధ రూపములుగ నానాత్వము వహించిన అవిద్య యందలి మార్పులే కారణమైయున్నవి. దీనికి అతీతుఁడగు బ్రహ్మము మాత్రము ఈ సమిష్టి యందంతటను ఎట్టి మార్పులేని వాడైయున్నాడు. ఈ జీవి అర్ధనారీశ్వరుని వలెనున్నాఁడు. (సగము - నారి(స్త్రీ) సగము ఈశ్వరుఁడు) ఈ 'నారి' అవిద్యాతత్త్వము మార్పునొందుచుండును. ఈశ్వరుఁడు - బ్రహ్మతత్త్వము మార్పు లేనిదైయుండును. పైతొడుగైన సూక్ష్మశరీరము కారణశరీరముతోఁ జేరి యుండును. కావున తైజసుఁడు - ప్రజ్ఞునితో గూడినవాఁడే యగుచున్నాడు.

కారణ శరీరమున మాయా సహితుఁడగు బ్రహ్మము ఈశ్వరుఁడనఁ బడుచున్నాడు. సూక్ష్మశరీమున అవిద్యతోగూడిన బ్రహ్మము 'హిరణ్య

గర్భుడు’ అని వ్యవహరింపఁబడుచున్నాడు. ఈ ప్రత్యేక నామములఁ
గల్పించుటకు ప్రత్యేక కారణములు గలవు. కారణ సూక్ష్మశరీరములచే
క్రమముగ నావరింపబడిన ప్రజ్ఞాజీవి – తైజస జీవుల కూర్పును నిర్దేశించు
టకే కారణ శరీరమునందధివసించు మాయా ఈశ్వరుఁడు ప్రజ్ఞా జీవుఁడనఁ
బడుచున్నాడు. సకలము నెఱుఁగఁజాలు పండితునివంటివాఁడగుటచేత నితఁడు
సర్వజ్ఞుడు – ప్రాజ్ఞుఁడనబడుచున్నాఁడు. ఈ ప్రజ్ఞాజీవుఁడు కారణశరీర
ముతో రెండవ పొరగను సూక్ష్మ శరీరమునఁ బ్రవేశించుచున్నాడు. కావున
అతని ఆత్మజ్ఞానదృష్టి సన్నగిల్లినది. కాని అతఁడు ప్రకాశవంతుఁడు. విజ్ఞుడై
యున్నాడు. కావున తైజసుఁడు. (ఆ తేజోతత్త్వమును గ్రహించువాఁడు)
అనబడుచున్నాడు. ఆ తైజసునియందు అవిద్యకతీతమై సూక్ష్మశరీరమునం
దధివసించు బ్రహ్మము-హిరణ్యగర్భుడని పిలువబడుచున్నాడు. ఈ దృశ్య
ప్రపంచముయొక్క సృష్టికర్త మనము సామాన్యముగా వ్యవహరించు
“బ్రహ్మ” యీ హిరణ్యగర్భుఁడగుచున్నాడు. ఈతడు చతుర్ముఖములు
గలిగి, సరస్వతి భార్యగా గలవాడు కావున ఈ తైజసుఁడు – హిరణ్య
గర్భుఁడు – లేక “బ్రహ్మ” సృజన కార్యములందు భాగస్వామియై
యున్నాఁడు.

ప్రాజ్ఞుఁడు – అతని కారణ శరీరము సత్త్వగుణమువలన గలిగి, ఆ
సత్త్వగుణముచే నావరింపబడియున్నాడు. తైజసుడు–అతని సూక్ష్మశరీరము
రజోగుణముచే గలిగి, ఆ రజోగుణముచే నావరింపబడి యున్నాడు. ఆతరు
వాత కోశము (వెలుపల తొడుగు) స్థూలశరీరము – తమోగుణమువలన
గలిగి, ఆ తమోగుణముచే నావరింపబడి యున్నది. తైజసుఁడు స్థూల శరీర
ముచే నావరింపఁబడి విశ్వుఁడు – అనంబడుచున్నాఁడు. విశ్వజీవునియందు
అవిద్యకు అతీతుడై యున్న బ్రహ్మము “వైశ్వానరుఁడు” అని పిలువబడు
చున్నాడు. ఈ విశ్వజీవుడు ఈ స్థూల శరీరమే తన ఆత్మయని పూర్తిగ

భ్రాంతియందు నిమగ్నుడైయున్నాడు. స్థూలశరీరము నందలి విశ్వుడు - సూక్ష్మశరీరములోని తైజసునితో, తదంతర్గతమగు కారణశరీరములోని ప్రాజ్ఞునితో జేరియున్నాడు. ఇంకను విశదముగా తెలిసికొన వలయుననిన ఈ సమిష్టి మాయా బ్రహ్మము. నొక్కొక్కట నొక్కొక్క పేరు గలిగిన మూడు తొడుగుల నొకదానిపై నొకటి తొడిగి యున్నాడు. కారణ శరీర కోశమునందు ప్రజ్ఞా - ఈశ్వరుడని, సూక్ష్మశరీర కోశమునందు తైజస - హిరణ్యగర్భుడని, స్థూలశరీర కోశమునందు విశ్వ - వైశ్వానరుడని, పిలువ బడుచున్నాడు.

ఈ తొడుపులు (కోశములు) అన్నియు విడిపడినపిదప ఈ అవిద్యా బ్రహ్మము-జీవుని గతి యేమగునను ప్రశ్న ముదయింపవచ్చును. అది బ్రహ్మ ప్రళయస్థితి. బ్రహ్మ కల్పము. అపుడీ జీవులన్నిటిని బ్రహ్మము తనయందు చేర్చుకొనును. అది సృష్టి తాత్కాలికముగ నిలిచిపోవు స్థితి. కాని పూర్తిగ నిలిచిపోదు. నూతన సృష్టియందీ జీవులందరు త్రోయబడుదురు. ప్రతి నూతన సృష్టియు క్రొత్తదికాదు. అంతకుపూర్వము జరిగి పరిపూర్ణత నొంధినది. పునరావృత్తమగుటయే. ఈ జీవియెప్పుడు జీవత్వస్థితిం బాసి జనన మరణ రూపమగు - ఈ సంసృతి భ్రమణంబునుండి విడివడును ?- అనిన అవిద్యనుండి బ్రహ్మము విడివడిన ఆ జీవుడు జీవస్థితిని బాయుడు. మాయ బ్రహ్మమగును. ఈ స్థితిలో నతడు సృష్టి చక్రమునుండి విడివడి నను బ్రహ్మైక్యము నొందనేరడు. అతడు సత్వగుణము నతిక్రమించి, త్రిగుణాతీతుడై, మూల ప్రకృతియందు మాయా తత్త్వము రహితమైనపుడు- పూర్ణ నిర్గుణ బ్రహ్మము - సంపూర్ణ ప్రకృతిపురుష తత్త్వము శేషించును. అదియే "ఏకమేవా ద్వితీయం బ్రహ్మ" మనబడుచున్నది.

రజస్తమోగుణములు బ్రహ్మమునకు బంధములైనట్లు సత్వగుణము బంధమే యగును. కాని యా త్రిగుణముల స్వభావ క్రియలు మాత్రము భేదించును. త్రిగుణ రహితమైనదే శుద్ధ బ్రహ్మము. ఈ సత్త్వరజస్తమస్సు లను త్రిగుణాత్మకమగు మూలప్రకృతియే యీ విశ్వసృష్టికి కారణము - కర్తయగును. సత్వప్రకృతి మాయ కాని యీ మాయ సృష్టికి హేతువు కాదు. రజోతమః ప్రకృతి – అవిద్య. ఈ అవిద్య విశ్వసృష్టికి దారి తీయును. రాజస ప్రకృతి సూక్ష్మ శరీరమును, తామస ప్రకృతి స్థూల శరీరమును సృజించును.

అయిన నిఁక "ఆత్మ" ఏమి ? – జీవునియందు నిరంతరము అదివ సించియుండు బ్రహ్మతత్వము – ఆత్మ మాయాచ్ఛాదిత బ్రహ్మతత్వమగు, బ్రహ్మైక్య స్థితిని విస్మరించుచున్నది. ఈ ఆచ్ఛాదితము – మాలిన్యము - అజ్ఞానము – భ్రాంతి - యనఁబడును. మాయ, అవిద్యలవలె నీఅజ్ఞానము- భ్రాంతి – ఈ ప్రకృతియొక్క మఱియొక రూపము. ఈ స్థితిలో సాత్విక ప్రజ్ఞాజీవి ఈశ్వరుడు అభిన్నులు. కావున కారణ శరీరమున - ప్రజ్ఞాజీవి - ఈశ్వరైక్యభావము ప్రతిపాదింపబడినది. ఈ మాయ - అజ్ఞాన - భ్రాంతి మాలిన్యముతో సమ్మిశితమైన కొలది రజో అవిద్య యగుచున్నది. రజో అవిద్య ఆత్మ (బ్రహ్మము) సూక్ష్మ శరీరమున తైజస జీవి యగుచున్నాఁడు. ఈ రజో అవిద్య యింకను మాలిన్య (అజ్ఞాన భ్రాంతి)ముతో సమ్మిశితమైనకొలది, స్థూలశరీరమునతమోఅవిద్య- ఆత్మ (బ్రహ్మము) "విశ్వజీవి" యగుచున్నాడు. గావున నన్నిటియందు ఆత్మ - బ్రహ్మమె యగుచు, స్థూల శరీరమున విశ్వుఁడై, సూక్ష్మశరీరమున తైజసుఁడై, కారణ శరీరమున ప్రాజ్ఞుఁడై నిర్దేశింపబడు చున్నాఁడు. ఆత్మ యీ శరీరముల నన్నిట వైశ్వానర - హిరణ్యగర్భ – ఈశ్వరుడైయున్నను

ఈ మాయ (అజ్ఞాన-భ్రాంతి) ఆచ్ఛాదనము తొలఁగినపుడే - బ్రహ్మైక్యత నొంది బ్రహ్మమే యగుచున్నాఁడు. ఆత్మయెప్పుడును బ్రహ్మమున కంటె భిన్నముగాదు. అది యీ శరీరము లందధివసించు బ్రహ్మమే యగుచున్నది. ఈ త్రివిధ శరీరములు - పొరలు తొలగిపోయినపుడు ఆత్మ తన సహజస్థితినొంది బ్రహ్మమై ప్రకాశించుచున్నది.

అజ్ఞానము - భ్రాంతియొక్క కార్యము జీవియందు నేను - నాది అను అహంకార మమకారములు కలిగించుటయే. ఈ అహంకారము జీవితోగూడి, సత్వరజస్తమోగుణములను మూటిని పొందుచుండును. ప్రజ్ఞ జీవి సాత్వికాహంకారము. తైజస జీవి రాజసికాహంకారము - విశ్వజీవి తామసాహంకారమును కలిగియుండును. ఈ జీవియందెంతెంత దనుక 'నేను' 'నాది' అను తలంపు పొదుకొనియుండునో ఆతండంత లంతల బంధములఁ జిక్కుకొనినవాఁడే. ఆ 'నేను' 'నాది' అను బుద్ధి పూర్ణముగఁ దొలగిననాడు అతడు బ్రహ్మమే యగుచున్నాడు. జీవియెన్నటికి బ్రహ్మము కాజాలదని కొందరనిన "అహంకార" నిర్మూలనము దుస్సాధ్యమని వారి నిశ్చయము. కావున జీవులు శాశ్వతముగ నెల్లకాలము జీవులుగ నుండవలసినదే. కొందరు జీవి ఈశ్వరుఁడై జనన మరణ పరిభ్రమణమునుండి విడివడ వచ్చును. గాని, యతఁ డెన్నటికి బ్రహ్మము మాత్రము కాఁజాలఁడని పలుకుదురు. శేషత్వము, భిన్నత్వము శాశ్వతమని వీరి భావము. మొదటివారు శ్రీ మధ్వసాంప్రదాయమువారు. రెండవవారు శ్రీ రామానుజ సాంప్రదాయమువారు, ఈ యిరువురు గాఢ భక్తిప్రపత్తులు గలిగి జనించినవారు. భక్తిపథమునందు ద్వైతమవసరము. భగవానుఁడు - భక్తుఁడు లేనిదే భక్తి అనునదిలేదు. దైవముతో నైక్యము - అభిన్నత్వము - సమానత్వమే

భక్తుఁడు కలిగియుండుట దురూహము - అపచారము నగును. భక్తుడు కాంక్షింప, దగిన అత్యుత్తమ వరము సంసృతి బంధ విముక్తిమాత్రమే. శ్రీ మధ్వాచార్యులుగారు ప్రహ్లాద ఆదర్శభక్తునిగ నుదహరించి, ధ్యానయోగ మును ద్వైత సిద్ధాంతమును ప్రబోధించినారు. శ్రీమద్రామాయణము నందు గుహుని, సుగ్రీవుని, విభీషణుని, ఆంజనేయుని భక్తిప్రపత్తులు సంపూర్ణ శరణాగతి. అత్యుదాత్తములుగ వివరింపబడినవి. శ్రీ రామానుజులవారు వీరిని వీరు పడసిన సాలోక్య, సామీప్య సాయుజ్య, గౌరవములతో గూడిన వైకుంఠ ప్రాప్తిని ఆదర్శముగా స్వీకరించినారు. ఇది భక్తుడు పొందదగిన అత్యుత్తమ వరముగఁ దెలిపినారు. భగవానుని స్థానముఁజేరుట, భగవంతుని సమీపమున నుండుట, భగవంతునితో సమానమగు రూపమును గొప్ప శక్తు లను బడయుటయేగాని, భగవానుడు మాత్రము కాఁజాలడని, వీరు విశిష్టా ద్వైత సిద్ధాంతమును ప్రబోధించిరి.

ఈ ద్వైత - విశిష్టాద్వైత సిద్ధాంత ప్రబోధకులగు ఆచార్యు లిరు వురు శ్రీ శ్రీనివాసభక్తకోటిలో నత్యుత్తములగుట జగద్విదితమే. వారి సిద్ధాంత ములు సకల జనులకుఁ దగియున్నవనక తప్పదు. కావున వానినిగూర్చి విమర్శలనవసరము. జగద్గురువులు శ్రీమచ్ఛంకర భగవత్పాదులు సర్వవిధ ములా వారితో నేకీభవించు చున్నారు. కాని శ్రీ శంకరులు వారి దృష్టి నింకను కేంద్రీకరించి పునఃపరిశీలనఁ గావించిరి. ఈ సృష్టియందంతటను బ్రహ్మము వికారములులేక ఒకేస్థితిలో నున్న కారణమున ఈ విశ్వసృష్టికి మూలప్రకృతియొక్క (అద్యస్పంద) శక్తియే కారణమగుటచేత ఈ అవిద్య- అజ్ఞాన - మాయ - అహంకారములు మూలప్రకృతియొక్క వివిధ రూప ములు - ఆ బ్రహ్మమునందు లయమొందింపబడి ఆ మూలప్రకృతియొక్క క్రియాశక్తి నిర్మూలింప సాధ్యముకాదా ? - అని పరిశోధించిరి.

శ్రీ మధ్వాచార్యులు శ్రీ రామానుజాచార్యు లిరువురు పురుష - ప్రకృతి జీవులు, ప్రత్యేకములనియు నా కారణమున నొకటి మఱియొక దానిలో లయమొందుట అసంభవమని నిర్వచించిరి. శ్రీ శంకరాచార్యులు పురుష ప్రకృతు లేక తత్వమగు బ్రహ్మమనియు, జీవిప్రకృతి ఉపాధి యందుఁ దోచు ప్రతిబింబమని నిరూపించిరి. ప్రకృతి సత్వరజస్తమోగుణ ములతో జేరి వేర్వేరు రూపముల బొందునటుల జీవియు ప్రజ్ఞ తైజసవిశ్వాది రూపముల నొంది ప్రకృతి కధనమై, ప్రకృత్యమగుణ్యములగు మార్పులఁ బడయుచుండును.

ఉపాధి బ్రహ్మమునందు లయమొందెడు ప్రతిబింబమును సహజ ముగ నా బ్రహ్మమునందే లయమొందును: ప్రకృతి బ్రహ్మముకంటె భిన్న మైన కారణమగునది బ్రహ్మమున లీనమగుట ఎట్లు సాధ్యమగునని శ్రీమధ్వ-రామానుజులు అంగీకరింపరైరి. కాని శ్రీ శంకరులు పురుష - ప్రకృతి సమిష్టితత్వమే బ్రహ్మమగుటచేత ప్రకృతి బ్రహ్మమున లీనమగుట సాధ్యమే అని ప్రతిపాదించిరి. కాని శ్రీ శంకర సిద్ధాంతము ననుసరించి వచ్చిన కష్టము - శ్రీ మధ్వ - రామానుజులు దుర్లభము అని తలంచినది లీనస్థితికాదు. వారి భేదస్థితి - వేర్పాటుల గూర్చియే వచ్చిన కష్టము. ఈ త్రిమతా చార్యులలో నెవరివాదము మిన్న ? యను తర్కముతో మనకు నిమిత్తములేదు. ఎఱుగఁకుండుటయే మేలన - తెలిసికొన్నటకై యత్నించుట అవివేకము అను లోకోక్తి కలదు. కావున వారివారి అనుభూతుల పురస్క రించుకొని, సాధకులు వారి అంతరాత్మ నిర్దేశించు విధమునఁ బ్రవర్తింప నగును.

వేదాంతమునందు దృక్ - దృశ్యములు రెండే ప్రధానాంశములు. దృక్ (ద్రష్ట) సూర్యునివలె స్వయంప్రకాశుడు. తన చుట్టుగల వస్తుసముదా

యమును ప్రకాశింపచేయును. ఆ కారణమున మనమా వస్తువులను తెలిసి కొనుచున్నాము. ఆ ద్రష్ట, సత్తు, అని జ్ఞానము అనియు వ్యవహరింపబడు చున్నాము. చూడబడునది వెలుపలనుండు పదార్ధము. సూర్యకిరణములచే ప్రకాశింపబడుచు మనము చూచు ఈ ప్రపంచము – దృశ్యము ఇది అసత్తు అనియు, అజ్ఞానమనియు వ్యవహరించ బడుచున్నది.

ఆ ద్రష్ట యదార్థముగ నొక్కడేయయ్యు నాయాస్థానములనుండి కావించు ఉపాధిభేదముల – క్రియాభేదములచేత, 1. బ్రహ్మము 2. ఈశ్వరుడు 3. హిరణ్యగర్భుడు 4. వైశ్వానరుడు అను నాలుగు రూపముల పిలువబడుచున్నాడు. ఈ స్థానమే దృశ్యము ఉపాధి, యని చెప్పబడు చుండును. ఇది రెండు విధములు 1. కారణము 2. కార్యము అని కారణోపాధి మాయ, కార్యోపాధి అవిద్య. ఈ అవిద్య – రజోగుణ సంబంధమని సూక్ష్మ శరీరమునకు మాతృక (మూలము) అనియు తమోగుణ సంబంధమున పంచభూతాత్మకమగు (పృధివి, ఆపస్సు, తేజస్సు, వాయువు, ఆకాశము) స్థూలశరీరమునకు మాతృక (మూలము) యనియు నెఱుగనగును.

ఆకాశమునకు శబ్దగుణము కలదు. వాయువునకు శబ్దస్పర్శ గుణములు రెండును గలవు. తేజస్సునకు శబ్దస్పర్శ రూపగుణములు గలవు. ఆపస్సునకు శబ్దస్పర్శ రూపరస గుణములు కలవు. పృథ్వి తత్వమునకు శబ్దస్పర్శ రూప రస గంథము లైదును గలవు. ఈ పంచభూతములందా యా ప్రత్యేక గుణములు విశేషమైయున్నను తక్కిన నాలుగు గుణములంత ర్భూతములై లీనమైయుండును.

స్థూలశరీరమునకు, 1. అస్థి (ఉండుట) 2. జాయతే (పుట్టుట) 3. వర్ధతి (పెరుగుట) 4. పరిణమతి (మార్పునొందుట) బాల్య కౌమార యౌవన వార్ధక్యములు) 5. క్షీయతే (కృశించుట) 6. వశ్యతి(నాశనమగుట)

అను ఆరుగుణములు కలిగియుండును. సమిష్టి కార్య ప్రపంచము. పంచ భూతాత్మకము ఈ విశ్వసృష్టి. ఆ దైవము బ్రహ్మము యొక్క విరాట్ స్వరూపము అని పిలువబడుచున్నది. సూక్ష్మాతిసూక్ష్మమునందు - కారణ సూక్ష్మశరీరములందు నధివశించియుండును. ఆ కారణముచేతనే ఆబ్రహ్మము "అణోరణీయాం మహతో మహీయామ్" అని స్తుతింపబడు చున్నాడు. సూక్ష్మతమము (అణువు) కంటే సూక్ష్మమనియు "మహత్తులకంటె మహత్తు" అని స్తుతింపబడుచున్నాడు. బ్రహ్మము కేంద్రంగా గలిగి బ్రహ్మముయొక్క విరాట్‌స్వరూపము - ఈ సకల విశ్వము ఆరు కోశ ములు ఆవరణములుగ విభజింపబడి ఏక కేంద్ర వృత్తములుగ నొకదానిలో నొకటి కూర్పబడియున్నది.

లోగడ అజ్ఞానము - అహంకారమునకు మూలము అని చెప్ప బడెను. ఆ అహంకారము నేను, నాది అనుతలంపు గలిగించును. ఇపుడు అజ్ఞానము భ్రాంతికిగూడ కారణమని తెలిసికొంటిమి. కావున మాయ - అవిద్య అజ్ఞానము అనునవి మూలప్రకృతియొక్క త్రివిధరూపములుగ మనకు తెలియుచున్నవి. ఇక మూలప్రకృతియొక్క నాల్గవరూపమగు అహం కారమునుగూర్చి శ్రీ శంకరాచార్యులుగారు వివరించిన విధమాలోచించుదము. సంస్కృత భాషలో ఒకేపదమున కాయా సందర్భముల ననుసరించి వేర్వేరు అర్థముల నిష్పన్నములగును. ఉదా॥ హరి అను పదమునకు విష్ణువు, ఇంద్రుడు, గుర్రము, సింహము, కప్ప, కోతి మొదలగు అర్థములు కలవు. అర్థానుగుణ్యముగ దానిని ప్రత్యేకపదముగ మనము గ్రహింపవలయును.

జీవునియందు గోచరించు నేను - నాది అను తలంపును అహం కారము - అను పేర దెలుపబడినను; మూల ప్రకృతి విషయమున జెప్ప బడు అహంకారమునకు అర్థము - ఆ మూలప్రకృతియొక్క ఇచ్ఛ - తేక

సంకల్పము అని మనము గ్రహింపవలయును. ఇది (అహంకారము) సృష్టికి ఆది కారణము ఈ అహంకారము (సంకల్పము లేక ఇచ్ఛ) నుండి ఆకాశ ముద్భవించును, ఆకాశమునుండి వాయువు, వాయువునుండి తేజస్సు, తేజస్సు నుండి ఆపస్సు, ఆపస్సునుండి పృథివి కలుగుచున్నవి. ఈ విధముగ అహంకారమునుండి క్రమానుగతముగ నొకదానివలన నొకటి పంచభూత ములుత్పన్నములగు చున్నవి.

పంచభూతములు వానియందుగల ప్రధాన గుణములు పంచతన్మాత్రలు – పంచజ్ఞానేంద్రియములు పంచకర్మేంద్రియములు మనస్సు బుద్ధి చిత్తము అహంకారము అనునవి 24 తత్వములు సాంఖ్యయోగమున కపిలాచార్యునిచే వివరింపబడినవి. ఇవి శబ్ద బ్రహ్మము ప్రణవము (ఓంకారము) తోగలసిన 25 తత్త్వము లగును. వీనివలన బ్రహ్మముయొక్క విరాట్ స్వరూపముత్పన్నమైనది. కొందరు తత్వ శాస్త్రజ్ఞులు పంచప్రాణములను గూడా మూలతత్త్వములకు జేర్చి తత్త్వముల సంఖ్య (30) ముప్పదిగ నిర్ణయించిరి. అవి–

| 1. పంచభూతములు | 2. పంచతన్మాత్రలు(ప్రధానగుణములు) |
|---|---|
| ఆకాశము | శబ్దము |
| వాయువు | స్పర్శము |
| తేజస్సు | రూపము |
| ఆపస్సు | రసము |
| పృథివి | గంధము |

| 3. పంచజ్ఞానేంద్రియములు | 4. పంచకర్మేంద్రియములు |
|---|---|
| శ్రోత్రము | వాక్కు |
| త్వక్కు | పాణి |
| చక్షుసు | పాదము |
| జిహ్వ | వాయువు |
| ఘ్రాణము | ఉపస్థము |

| 5. పంచప్రాణములు | 6. అంతఃకరణ చతుష్టయము |
|---|---|
| ప్రాణము | మనస్సు |
| అపానము | బుద్ధి |
| వ్యానము | చిత్తము |
| ఉదానము | అహంకారము |
| సమానము | 7. శబ్దబ్రహ్మము–ప్రణవము |

మఱికొందఱు జీవి – అజ్ఞానము అను రెంటిని చేర్చి మొత్తము (30+2) 32 తత్త్వములుగా నిర్ణయించిరి. ఆ పరబ్రహ్మము విశ్వజననిగా నుపాసించుతారు. మాయను – జ్ఞాపకశక్తిగ, అహంకారమును ఇచ్ఛాశక్తిగ, అవిద్యను – క్రియాశక్తిగ, అజ్ఞానముపై మూడు శక్తుల కర్మభూమిగ, పరిణామముగ, నిరూపించిరి. ఈ శక్తి త్రికూటము – జ్ఞాన ఇచ్ఛా క్రియా శక్తులొక సముద్రమైన, అందుండి పొడముచు లయించుతరంగములే అజ్ఞాన కర్మభూమిగ గ్రహింపదగును.

దృక్ – దృశ్య సంబంధము మూడు విధములు లేక గతులు 1. జాగ్రత్ 2. స్వప్న 3. సుషుప్తి.

1. జాగ్రత్ స్థితి - మెలకువ స్థితియందు ద్రష్ట స్థూలశరీరము నందున్న విశ్వజీవి. ఇంద్రియ జ్ఞానమున నీ ప్రపంచము నేలుచుండును. ఈ స్థితిలో ద్రష్ట - దృక్ - దృశ్యము అను త్రిపుటి వర్థిల్లుచుండును. తక్కిన మూడు స్థితులందు దృక్కు ద్రష్టయందు లీనమొందుచుండును. స్వప్న స్థితియందు సూక్ష్మశరీరాంతర్గతుడగు తైజసజీవి ద్రష్టయైయున్నాడు. ఈ స్థితిలో జ్ఞానేంద్రియములు పనిచేయు కారణమున అంతఃకరణ చతుష్టయము (మనస్సు - బుద్ధి - చిత్తము - అహంకారము) ద్వారా ప్రపంచము నెఱుగుచున్నాడు. 3 సుషుప్తి (గాఢనిద్ర) స్థితియందు కారణశరీరాంతర్గతుడగు ప్రాజ్ఞజీవి - ద్రష్టపై దెలుపబడిన ముప్పది తత్త్వములతో గూడిన ప్రపంచమును తనకంటే భిన్నముగా - దానితో తనకెట్టి సంబంధములేని ద్రష్ట - సాక్షిగ, దన్ను గుర్తించుచు ఈ జగన్నాటకమును సాక్షిమాత్రుడుగ నరయు వాడగుచున్నాడు.

నాల్గవస్థితి-తురీయస్థితియందు (సుషుప్తికి అతీతమైన స్థితియందు) బ్రహ్మము - కారణశరీరమును త్రోసిరాజని - మాయాసంబంధము లేక తన సత్యపవిత్ర కేవల బ్రహ్మస్వరూపమును బడయును. ఇదియే సమాధి స్థితి యనబడును. ఇదియే యోగుల గమ్యము. ఈ స్థితియందు దృశ్యము ద్రష్టయందు లయమొంది అద్వితీయస్థితి ఏర్పడును. అట్టి స్థితినే "ఏకమద్వితీయం బ్రహ్మ" మని ఉపనిషత్తులు విశదపఱచుచున్నవి.

ఓం శాంతిః శాంతిః శాంతిః

శ్రీ కృష్ణార్పణమస్తు.

# పోషకులు

| | |
|---|---|
| శ్రీ పొదిలి విశ్వనాథశర్మగారు, యస్. ఇల్లిందలపర్రు | రు 233-50 |
| శ్రీ బొడ్డు రామయ్యగారు, విశాఖపట్టణము | రు 200-00 |
| శ్రీ యస్. రాధాపతిరావు, నూజివీడు | రు 175-00 |
| శ్రీ సి. విస్సావధానులు, ఉలవపాడు | రు 152-00 |
| శ్రీ సి. లక్ష్మీనారాయణ, ,, | రు 130-00 |
| శ్రీ మంచికంటి వెంకటశివరామయ్య, హెచ్. యం. పాకాల | రు 116-00 |
| శ్రీ చక్రావధానుల కృష్ణమూర్తిగారు రిటైర్డ్ యస్. బి. ఐ. ఆఫీసరు, చంద్రగిరి | రు 116-00 |
| శ్రీమతి జి. అరవిందగారు, హైదరాబాదు | రు 116-00 |
| శ్రీ పి.ఆర్. కృష్ణప్రసాద్, యస్.బి.ఐ. ఆఫీసరు, రాజమండ్రి | రు 116-00 |
| శ్రీ జి. రామారావు, ఖర్గపూరు | రు 105-00 |
| శ్రీ బండారు వెంకటసత్యనారాయణ, వరరామచంద్రాపురం | రు 100-00 |
| ఒక అంతరంగిక భక్తుడు, నెల్లూరు | రు 100-00 |
| శ్రీ గారపాటి లక్ష్మణరావు, అమలాపురం | రు 85-00 |
| శ్రీ మాధవపెద్ది లక్ష్మీనరసింహారావు, విశాఖపట్టణము | రు 80-00 |
| శ్రీ శేషగిరి సత్యనారాయణ, బి. ఇ., జంగారెడ్డిగూడెం | రు 78-00 |
| శ్రీ నందనవనము వేంకటసుబ్బరామయ్యశర్మ, నందనవనం | రు 58-00 |
| శ్రీ బి. వి. సుబ్రహ్మణ్యసాయి, యం. టెక్., కోయంబత్తూరు | రు 58-00 |
| శ్రీ కె. బలరామయ్య, చల్లపల్లి | రు 55-00 |
| శ్రీ పి. దివాకరరావు, డి. సి. టి. ఒ., తుని | రు 51-00 |
| శ్రీ ఆర్. సీతారామయ్య, ఖరగ్‌పూరు | రు 50-00 |
| శ్రీ ఆర్. రంగనాథం, అడ్వకేట్, కడప | రు 50-00 |
| శ్రీ యస్. వి. రాంప్రసాద్, నెల్లూరు | రు 50-00 |

| | | |
|---|---|---|
| శ్రీ జి. కేశవ రామమూర్తి, అడ్వకేట్, నరసాపురం | రు | 50-00 |
| శ్రీ వి. గురవరాజుగారు, అంబాజీపేట | రు | 50-00 |
| శ్రీ అడుసుమల్లి రాధాకృష్ణమూర్తి, గుంటూరు | రు | 47-00 |
| శ్రీ యమ్. రామమూర్తి మరియు శ్రీమతి లక్ష్మీకుమారిగార్లు, కోడూరు | రు | 45-00 |
| శ్రీమతి మేడా పద్మావతి w/o రాజయ్య, ఉదయగిరి | రు | 45-00 |
| శ్రీమతి వి. ఉమాకామేశ్వరి, మచిలీపట్టణం | రు | 40-00 |
| శ్రీ కె. ప్రసాదరాజు, దగ్గులూరు | రు | 40-00 |
| శ్రీ శేషగిరి వీరరాఘవులు, శ్రీమతి ఆదిలక్ష్మీగార్లు హైదరాబాదు | రు | 40-00 |
| శ్రీ యస్. సుబ్బారావు, ఎ. యస్. ఎమ్., ఉలవపాడు | రు | 35-00 |
| శ్రీ పెనుమర్తి వీరరాఘవయ్యగారు, తెనాలి | రు | 35-00 |
| శ్రీ యమ్. కె. రామారావు, విజయనగరం | రు | 35-00 |
| శ్రీ ఆర్. యస్. రావు. కె.ఎ.డి.యమ్.ఎ., జంషెడ్‌పూర్ | రు | 35-00 |
| శ్రీ కోట ధనరాజు, యమ్. ఎల్. ఎ., ఆచంట | రు | 35-00 |
| శ్రీ డి. వి. సుబ్బరాజు, ఎ.జి.పి.ఒ., పాలకొల్లు | రు | 35-00 |
| శ్రీ నాగుబండి వెంకటేశ్వరరావు | రు | 35-00 |
| శ్రీ కె. వి. యస్. ప్రకాశరావు, బి. ఇ., పాలకొల్లు | రు | 34-00 |
| శ్రీ కె. సత్యనారాయణరాజు, రిటైర్డ్ డెప్టికలెక్టర్, కొత్తవలస | రు | 30-00 |
| శ్రీ యస్. రామలింగస్వామి, ప్రిన్సిపాల్, పాలకొల్లు | రు | 29-00 |
| శ్రీ పి. వి. రాఘవరావు, అడ్వకేట్, రాజమండ్రి | రు | 25-00 |
| శ్రీ కర్రి రామిరెడ్డి, పాలి | రు | 25-00 |
| శ్రీ చోడవరపు కృష్ణారావుగారు, ఎమ్. ఎ., విజయవాడ | రు | 25-00 |
| శ్రీ కె. నరసింహారావుగారు, పోడూరు | రు | 25-00 |
| శ్రీ యస్. రామకృష్ణ, పామర్రు | రు | 25-00 |

| | |
|---|---|
| శ్రీ ఎ. ప్రభాకరన్, మచిలీపట్టణం | రు 25–00 |
| శ్రీ శీలంశెట్టి వీరవెంకటసత్యనారాయణ, కొవ్వూరు | రు 25–00 |
| శ్రీ ఆకెళ్ళ పార్థసారధి, భీమవరం | రు 25–00 |
| శ్రీ ముల్పూరి సుబ్బారావు, ముక్కామల | రు 25–00 |
| శ్రీ యమ్. పి. వి. సి. దొర | రు 23–00 |
| శ్రీమతి కంచుస్తంభం జగ్గాయమ్మగారు, దొడ్డిపట్ల | రు 22–00 |
| శ్రీ రేవు లక్ష్మణస్వామి, నర్సాపురం | రు 22–00 |
| శ్రీ ఎ. యస్. కిశోర్, హైదరాబాద్ | రు 20–00 |
| శ్రీ యల్. శోభారాంశాగు, మచిలీపట్టణం | రు 20–00 |
| శ్రీ నెక్కంటి స్వామి, సర్పంచ్, నడిపూడి | రు 20–00 |
| శ్రీ జె. వి. రమణయ్య, పెద్దాపురం | రు 20–00 |
| శ్రీ పి. వి. రమణయ్య, బి. కామ్., మద్దూరు | రు 21–00 |
| శ్రీ నిడదవోలు సత్యనారాయణ, వినాయకనగర్ | రు 20–00 |
| M/s శ్రీ సత్యసాయి ఎంటర్‌ప్రైజెస్, భీమవరం | రు 20–00 |
| శ్రీ వనమా వెంకటకోటేశ్వరరావు, మర్రిపూడి | రు 20–00 |
| శ్రీ డా॥ సి. హెచ్. వీరరాఘవులు | రు 20–00 |
| శ్రీమతి ఆర్. శ్యామల, కొవ్వూరు | రు 20–00 |
| శ్రీ కె. రాఘవులు, తణుకు | రు 20–00 |
| శ్రీ సి. హెచ్. శ్రీహరిరావు, విశాఖపట్టణము | రు 20–00 |
| శ్రీ ఆర్. నరసయ్య, హైదరాబాదు | రు 20–00 |
| శ్రీ ఆకెళ్ళ సుబ్బారాయుడు | రు 20–00 |
| శ్రీ ఆత్మకూరి అంకారావు, నర్సరావుపేట | రు 20–00 |
| శ్రీ వై. శ్రీరాములు, ఆగర్రు | రు 19–00 |
| శ్రీ టి. సాయికుమార్, సాలూరు | రు 15–00 |
| శ్రీ వి. పట్టాభి సీతారామయ్య, ఉలవపాడు | రు 15–00 |

| | |
|---|---|
| శ్రీ కలగా యస్. ప్రసాద్, పాలకొల్లు | రు 15-00 |
| శ్రీ పి. వెంకటరాజయ్య, హైదరాబాదు | రు 15-00 |
| శ్రీ కిలుగు రంగారెడ్డి, కందివలస | రు 15-00 |
| శ్రీ ఈమని శ్రీరామమూర్తి, పోడూరు | రు 15-00 |
| శ్రీ పి. వి. నాయుడు, హైదరాబాదు | రు 15-00 |
| శ్రీ టి. వెంకటేశ్వర్లు, కోయంబత్తూరు | రు 12-00 |
| శ్రీ వి. వి. నరసింహారావు, యస్. బి. ఐ., నెగ్గిపూడి | రు 12-00 |
| శ్రీ సూరిశెట్టి మహేశ్వరరావు, ఖరగ్‌పూరు | రు 11-00 |
| శ్రీమతి సరోజినిదేవరాజులునాయుడు, కలకత్తా | రు 11-00 |
| శ్రీ డి. ఏకాంబరం, ఎ. యస్. యమ్., ఉలవపాడు | రు 10-00 |
| శ్రీ కె. రామమూర్తి, ఖరగ్‌పూరు | రు 10-00 |
| శ్రీమతి నీలంరాజు రాజ్యలక్ష్మి, చెరువు | రు 10-00 |
| శ్రీమతి వి. పైడితల్లి, విశాఖపట్టణం | రు 10-00 |
| శ్రీ మంచికంటి సాయిబాబా, ఏలూరు | రు 10-00 |
| శ్రీ ఇ. చెన్నయ్య, పాణ్యం | రు 10-00 |
| శ్రీ ముద్దా వేణుగోపాలరావు సోదరులు, ఆలూరు | రు 10-00 |
| శ్రీ పేర్ల చెంచయ్య, కమలమ్మలు, ఒంగోలు | రు 10-00 |
| శ్రీ వి. వి. యస్. యస్. తిలక్, విశాఖపట్టణము | రు 10-00 |
| శ్రీమతి మాదిరెడ్డి బ్రాహ్మణి, బి. ఎ., రాజమండ్రి | రు 10-00 |
| శ్రీ జి. వెంకటేశ్వరరావు, కొవ్వలి | రు 10-00 |
| శ్రీ సావడి సుబ్బారావు, నందితావరె | రు 10-00 |
| శ్రీ సావడి వీరరాఘవరావు, నందితావరె | రు 10-00 |
| శ్రీ కోడూరు వెంకటసుబ్రహ్మణ్యశర్మ, కబ్బళ | రు 10-00 |
| శ్రీ అనిశెట్టి రామబ్రహ్మానందరావు, కబ్బళ | రు 10-00 |
| శ్రీ యమ్. వి. కృష్ణారావు, గుంటూరు | రు 8-00 |

| | |
|---|---|
| శ్రీ టి. రామచంద్రరావు, ఏలూరు | రు 15-00 |
| శ్రీమతి దేవరపల్లి వెంకటేశ్వర్లు భార్య స్వరాజ్యమ్మ, నాగులపాడు | రు 10-00 |
| శ్రీ గంగరాజు మార్కండేయశర్మగారు | రు 10-00 |
| శ్రీ జాస్తి సూర్యనారాయణ, జాలిపూడి | రు 8-00 |
| శ్రీ అత్తలూరి వెంకట్రావు, ఖర్గపూర్ | రు 5-00 |
| శ్రీ పన్నీరు హేమసుందరరావు, ఖర్గపూర్ | రు 5-00 |
| శ్రీ వి. అప్పారావు, ఖర్గపూర్ | రు 5-00 |
| శ్రీ అలమూరి నారాయణరావు, ఖర్గపూర్ | రు 5-00 |
| శ్రీ బొడ్డపాటి నరసింహారావు, ఖర్గపూర్ | రు 5-00 |
| శ్రీ యమ్. కృష్ణానందం | రు 5-00 |
| శ్రీ యల్. నరసింహాచార్యులు, మండపాక | రు 5-00 |
| శ్రీ పి. యస్. వి. రావు, కద్మ | రు 5-00 |
| శ్రీమతి కాపు వెంకటసుబ్బయ్య భార్య నాగేంద్రమ్మ, నాగులపాడు | రు 5-00 |
| శ్రీమతి కాపు శ్రీరాములు భార్య సీతారామమ్మ ,, | రు 5-00 |
| శ్రీమతి ఆళ్ళ సాంబ్రాజ్యమ్మ ,, | రు 2-00 |
| శ్రీమతి కాపు పెదసీతారామమ్మ ,, | రు 2-00 |
| శ్రీమతి కూనిశెట్టి నాగరత్తమ్మ ,, | రు 1-00 |